24.12.1993 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 52, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్ రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు



## వైఎస్, కోట్ల ముఖాముఖీ యుద్ధానికి తలపడుతున్నారు

# రణరంగమౌతున్న రాయలసీమ!

మంత్రి వర్గం నుంచి రాజీనామా ఇచ్చిన శ్రీ డిఎల్ రవీంద్రరెడ్డి శాసన సభలో చేసిన ప్రకటన రాయల సీమను రాజకీయ కురుక్షేత్రంగా మార్చడానికి పూరించిన పాంచ జన్యంగా భావించవచ్చు. మైదుకూరు కల్తీమద్యం దుర్ఘటన



అనంతరం సినిమాలో రీళ్లవలె చకచకా తిరుగుతున్న రాజకీయ పరిణామాల పరంపరకు ఇది పరాకాష్ఠ. రవీంద్ర రెడ్డి తన ప్రకటనలో ముఖ్యమంత్రిపై చాలా తీవ్రమైన ఆరోపణలు చేశారు. వాటికి సమాధానం చెప్పడం ఆయనకు చాలా సంకట పరిస్థితిని కల్పిస్తుందనడం నిజం. అందులోనూ అసెంబ్లీలో చేసిన ప్రకటన కాబట్టి ఆయన ఇరకాటంలో పడిపోయారు.

రవీంద్రరెడ్డి ఈ ప్రకటనను అనాలోచితంగా చేసి వుంటాడని ఎవరూ భావించడం లేదు. తమ భవిష్యత్ రాజకీయాలపై ఒక స్పష్టమైన అవగాహనతోనే ఆయన సాహసానికి పూను[illegible] వుంటాడన్నది నిజం. ఆ అవగాహన ఏమిటి? ఇంకేముంటుంది-కోట్లతో ముఖాముఖి యుద్ధం తప్ప! దివాకర రెడ్డి, మైసూరారెడ్డిల బ్రెయిన్ వాష్‌తో విజయ భాస్కరరెడ్డిగారు రాజశేఖర రెడ్డిని రాచి రంపాన పెడుతున్నారు. ఆయనకు షోకాజ్ నోటీసు ఇప్పించడంతో పాటు, వారి కుటుంబానికి ప్రధాన ఆర్థిక వనరు అయిన బరైటీస్ గనుల లీజు రద్దు చేశారు. కేంద్ర క్రమశిక్షణా సంఘం ఛైర్మన్‌గా వైఎస్‌ను పార్టీనుంచి బహిష్కరించే పన్నాగం కూడా పన్నాడని వినికిడి. అయితే రాజశేఖర రెడ్డి ఆ షోకాజ్ నోటీసుకు ఇచ్చిన సమాధానంగా క్రమశిక్షణా సంఘం చేతులు కట్టి పారేసింది. వినయం కల్గిన కాంగ్రెస్ వాదిగా ఆయన తన అభిప్రాయాలు ప్రకటించాడు. దాన్ని స్వీకరించి, ఏదైనా స్వల్ప మందలింపుతో వదిలేయడం తప్ప



ఆయనపై చర్య తీసుకోవడం కుదరని పని.

పార్టీలో తన పరిస్థితి కుదుట పడడంతో రాజ శేఖరరెడ్డి ముఖ్యమంత్రిపై ప్రత్యక్ష యుద్ధ ప్రకటన చేస్తున్నాడు. అందుకు నాందీ ప్రస్తావన రవీంద్రరెడ్డి ప్రకటనలో కన్పడుతున్నది. రాయల సీమ రాజకీయ వాదులందరూ ఇకనుంచి ఈ రెండు శిబిరాలలో సమీకృత మయ్యే సూచనలు కన్పిస్తున్నాయి. ఇద్దరూ రాయల సీమ పౌరుషానికి పెట్టింది పేరనదగిన నాయకులే. పంతానికి వస్తే ఎంత దూరమైనా తాడు లాగడానికి సంసిద్ధులే. విజయ భాస్కరరెడ్డికి పదవి, అధికారం అండగా వుంటాయి; రాజశేఖరరెడ్డికి ప్రజలలో వున్న, క్రేజ్, సానుభూతి, అభిమానం వెన్నుదన్నుగా నిలుస్తాయి. వైఎస్ అభిమతం రణానికి మొగ్గు చూపుతున్న · దనడానికి, కెఇ కృష్ణమూర్తి ప్రధానికి పంపిన అభ్యర్థన పత్రం కూడా ఒక సాక్ష్యం. కర్నూలు లోక్ సభ ఉప ఎన్నికకు ముఖ్యమంత్రి కుమారుడ్ని కాకుండా, ఒక స్థానిక ముస్లిం అభ్యర్థికి అవకాశం కల్పించాలని ఆయన ప్రధానిని కోరారు. కర్నూలు జిల్లా రాజకీయాలలో బద్ధ శత్రువులైనప్పటికి కెఇ, కోట్ల లిద్దరూ ఇటీవల కొంత కాలంగా సఖ్యతతో వుంటుండినారు. వైఎస్ రాజకీయ వ్యూహంతో [illegible] బెడిసి కొట్టింది.

వైఎస్ దారిని త్రిప్పి కొట్టడానికి ముఖ్యమంత్రికి వున్న ఒకే ఒక మార్గం - రవీంద్ర రెడ్డిని పార్టీ నుంచి బహిష్కరించడం. అయితే రవీంద్రరెడ్డి ఎఐసిసి సభ్యుడైనందువల్ల ఆయన్ను బహిష్కరించే అధికారం



రాష్ట్ర కమిటీకి లేదు. అందువల్ల క్యాబినెట్ సమావేశంలో రవీంద్రరెడ్డి బహిష్కరణ కోరుతూ తీర్మానం చేసి ప్రధానికి పంపాలని కోట్ల తల పోస్తున్నాడు. కాని, అది అనుకున్నంత సులువుగా జరిగేట్లు లేదు. రవీంద్ర

కొరవ 12 పేజీలో

# ఎన్టీఆర్ ఇంటి అమ్మకం డ్రామా!

తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్టీ రామారావు ఏది చేసినా అది నాటకీయంగానే వుంటుంది. తాను తీసుకునే నిర్ణయాలతో ప్రజల

> **కూతురు పేరుతో వుండడం వల్ల పార్వతికి దక్కదని అమ్మకానికి పెట్టి పార్టీ నిధుల సాకు చూపుతున్నాడు!**

సానుభూతి పొందాలన్న తపన తప్పితే వాటిలో చిత్తశుద్ధి అవగింజంత కూడా వుండదు. తెలుగు దేశం పార్టీకి "నిధులు లేవట". అందుకని ప్రస్తుతం తానుంటున్న ఇంటిని తెగనమ్మి పార్టీకి నిధులు సమకూరుస్తారట. ఈ విషయాన్ని తెలుగుదేశం పార్టీ వారే స్వయంగా పత్రికల వారికి తెలియజేశారు. పత్రికలు ఆ విషయాన్ని బాక్సు కట్టి మరీ మొదటి పేజీలో ప్రచురించాయి. హైదరాబాదులోని బంజారాహిల్స్ రోడ్ నెం13 లో వుంటున్న ఇల్లు తన చిన్న కూతురు కోసం అప్పట్లో 13 లక్షల రూపాయలు పెట్టి కొన్నాడు. అయితే చిన్న కూతురు అమెరికాలో స్థిర పడిపోవటంతో ఆమెకు అక్కడే ఒకఫ్లాటు ఇప్పించి రోడ్ నెం13 ఇల్లును తనే వుంచుకున్నాడు. ఇరుకు రోడ్డులో స్మశానాలకు దగ్గరగా వున్న ఈ ఇల్లు వాస్తుపై మోజుపడి ఎన్టీఆర్ కొనుక్కున్నాడు. అయితే ఇల్లు చిన్నది కావటం, రోజూ ఇంటికి వచ్చి పోయేవారి సంఖ్య పెరగడం వల్ల ఇల్లు మార్చాలని ఎన్టీఆర్ భావించారు.

కొరవ 12 పేజీలో

# భారతీయ రైతుకు డంకెల్ సంకెళ్ళు!

కాకులు అరుస్తూనేవున్నా సరివారు ఎందుకున్నట్లు డంకెల్ డ్రాఫ్ట్‌కి భారత ప్రభుత్వం తన సమ్మతి తెల్పింది. ప్రతిపక్షాల రచ్చ కాకిగోలే అయ్యింది. కనీసం ఏమి జరుగుతున్నదీ ప్రజలకు చెప్పనేలేదు. అంబాలాలివ్వేకాం. తన్నుకు చావంతన్నట్లు ప్రవర్తించారు ప్రధానమంత్రి, ఆర్థిక మంత్రి కూడా! దీనిలో వారికి వ్యక్తిగత స్వార్థమేదీ లేకపోవచ్చు. వారి దృష్టిలో డంకెల్ ఒప్పందం భావిభారత సౌభాగ్యానికి అత్యవసరమనే భావన వుండి వుండవచ్చు. ఈ ఒప్పందం ద్వారా భవిష్యత్‌లో ఎగుమతుల వ్యాపారం మూడు పువ్వులు, ఆరుకాయలుగా విరాజిల్లుతుందన్న విశ్వాసం వుండివుండవచ్చు. అయితే భారతదేశం వారిద్దరి స్వంతం కాదు. ఎనభైఐదుకోట్ల ప్రజల భవితవ్యాన్ని శాసించే నిర్ణయాలు ఏకొందరు వ్యక్తుల విచక్షణకే పరిమితం కావడం శ్రేయస్కరం కాదు. ఇటువంటి కీలకమైన విషయాలలోవిస్తృతమైన చర్చలద్వారా, విఫలమైన సంభాషణల ద్వారా, విస్తారమైన భావసమీకరణాల ద్వారా పరిణామాలన్నింటినీ విశ్లేషించి, మథించి, శోధించి, నిగ్గు తేల్చి ఒక నిర్ణయానికి రావాలి. కాని ప్రభుత్వం అటువంటి ప్రయత్నమేదీ చేయలేదు. ఎవరితోనూ సంప్రదించ లేదు; చర్చించలేదు; కనీసం ఒప్పందంలోని వివరాలూ ప్రజలకు చెప్పలేదు. కొందరు అధికారులను మాత్రం జెనీవాకు పంపి, గుట్టుచప్పుడు కాకుండా పని జరిపించేసింది.

డంకెల్ ఒప్పందంపై ఇప్పటికి 116 దేశాలు సంతకాలు చేశాయి. అన్నిదేశాల వారు అంగీకరించిన ఒప్పందం మనం ఒక్కరం వ్యతిరేకించడంలో అర్థం వుండదు. కాని ఆయా దేశాలు తమ అవసరాల కనుగుణంగా ఒప్పందంలో చేసుకొన్న మార్పులు, మనం చేయించుకోగల్గామా అన్నదే ప్రశ్న. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో భారత దేశపాత్ర, ప్రమేయం నామమాత్రం. ప్రపంచ ఎగుమతుల మార్కెట్‌లో భారతదేశం వాటా కేవలం 0.4 శాతం ఇండియా విస్తీర్ణంలో, జనాభాలో సూరవ వంతుకూడా వుండని తైవాన్, కొరియా, హాలండ్, స్వీడన్, స్విట్జర్లాండ్ వంటి చిన్నదేశాలతో పోల్చినా మనం ఎక్కడో అడుగాళాన వున్నాం. డంకెల్ ఒప్పందం అమలైన తర్వాత ప్రపంచ ఎగుమతుల వ్యాపారం 275 బిలియన్ డాలర్లు పెరుగుతుందని అంచనా అయితే, దానిలో భారత్ వాటా ఒక్కబిలియన్ డాలర్‌గా వుంటుందని వూహిస్తున్నారు. అంటే కేవలం 0.36 శాతం అంటే ఒప్పందం వున్నా లేకపోయినా మనం అడుగునే పడివుంటామన్నమాట.

**విత్తనాల పేటెంట్ సమస్యే కాదు - ఎరువులు, కరెంట్ సబ్సిడీల విషయంలోనూ భారతీయ రైతు విపరీతంగా నష్టపోవలసి వస్తుంది; నిషేధించిన తెగుళ్ళ మందులు వాడారన్న సాకుతో మనం పండించే వ్యవసాయోత్పత్తులను ఎగుమతి కనర్హంగా ప్రకటించే ప్రమాదం వుంది!**

ఈ హీన పరిస్థితి వల్లనే డంకెల్ చర్చల సందర్భంలో అగ్రదేశాలు భారత్‌ను పట్టించుకోలేదు. ఏతెనిమిది బడా దేశాల ప్రతినిధులు లోపలకూర్చొని చర్చల ఒప్పందాన్ని రూపొందిస్తుంటే తక్కిన నూట చిల్లర దేశాలు నోట్లోవేలేసుకొని వరండాల్లో నిలబడి ఆశగా ఎదురుచూస్తుండినాయి. ఆ గుంపులో భారతదేశమూ ఒకటి కావడం మన దురదృష్టం. ఈ అవమానకర పరిస్థితిని వూహించే స్వర్గీయ ప్రధాని రాజీవ్‌గాంధీ డంకెల్ ప్రస్తావన రాగానే అనాటి కేంద్రమంత్రి విపిసింగ్‌ను అర్జెంట్‌గా పంపి, చర్చలలో భారత్‌కు ప్రాధాన్యత వచ్చేటట్లు చూడమన్నారు. వర్థమాన దేశాలన్నింటినీ ఒక కూటమిగా రూపొందించి, అగ్రదేశాలు చెవి ఒగ్గి తీరవలసిన బలీయమైన శక్తిగా దాన్ని తయారుచేయడానికి రాజీవ్ ప్రయత్నించారు. ఆయన ఆలోచనలలో నుంచి పుట్టించే జి - 15దేశాల కూటమి. కనీసం ఆసియా ఖండంలోని వర్థమాన దేశాలను ఐక్యం చేయగల్గినా అగ్రదేశాల మెడలు వంచవచ్చని ఆయన భావించారు. కాని దురదృష్టవశాత్తు అంతటి దూరదృష్టి, విచక్షణ, రాజకీయ పరిణతి, నాయకత్వ పటిమ కల్గిన నాయకుడు ఇప్పుడు మనకు లభించకుండా పోయారు. దీని ఫలితంగా ఏతెనిమిది శక్తివంత దేశాలు తమకనుకూలంగా ఒక ఒప్పందాన్ని వ్రాసుకొని, తక్కిన దేశాలన్నీ దాన్ని అంగీకరించి తీరాలని బెదిరించి, సంతకాలు చేయించారు. అందువల్లనే అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్, సంతకాలు ముగియగానే అమెరికాకు ఇది "చారిత్రాత్మక విజయం" అని సగర్వంగా ప్రకటించి, వైట్‌హౌస్‌లో ఆనందోత్సవం జరిపించి ఖరీదైన డిన్నరు ఇచ్చాడు. గాట్ (జనరల్ అగ్రిమెంట్ ఫర్ ట్రేడ్ అండ్

**మందులు కంప్యూటర్లు యంత్రాలు అన్నీ అమెరికా గుత్తాధిపత్యం క్రిందకు వెళ్తాయి!**

టారిఫ్స్)గా పిలవబడే ఈ ఒప్పందం మనం వద్దన్నా మనపై ఒక గుదిబండవలె వచ్చి పడింది.

దీని వల్ల ప్రధానంగా ప్రభావితమయ్యే రంగం - వ్యవసాయం. గాట్ మార్గదర్శక సూత్రాల ప్రకారం స్థూల వ్యవసాయోత్పత్తిలో 10 శాతంకు మించి వ్యవసాయ రంగానికి ప్రభుత్వం సబ్సిడీలు ఇవ్వరాదు. సబ్సిడీలు అంటే - అన్ని రకాలూ. అంటే - నీటి తీరువా, భూమి శిస్తు, ఎరువులు, విత్తనాలు, కరంట్ ఛార్జీలు, ఎగుమతి ప్రోత్సాహకాలు తదితరాలతో పాటు, మద్దతు ధర కూడా సబ్సిడీ క్రింద వస్తుంది. దేశంలో పలు రాష్ట్రాలలో వ్యవసాయ రంగానికి చవకగా కరెంట్ సరఫరా చేస్తున్నారు. ప్రభుత్వమే ప్రాజెక్టుల ఖర్చు భరించి రైతులకు ఉచితంగా నీరు సరఫరా చేస్తున్నాయి. స్ప్రింక్లర్లు, డ్రిప్ ఇర్రిగేషన్ వంటి ఆధునిక పద్ధతుల ప్రోత్సాహానికి సబ్సిడీలు ఇస్తున్నాయి. బోర్లు వేసుకోవడానికి సహాయం చేస్తున్నాయి. చెరకు, వేరుసెనగ, పామాయిల్, పొగాకు వంటి పైర్లకు ప్రభుత్వం పలు రూపాలలో సబ్సిడీలుస్తున్నది. విదేశాల నుంచి దిగుమతి చేసుకునే ఎరువులకు ప్రభుత్వం ధర చెల్లించి, తక్కువ ధరలకు సరఫరా చేస్తుంది. అన్ని చేసిన తర్వాత కూడా రైతుకు గిట్టుబాటు ధర రాకుంటే మద్దతు ధర ప్రకటించి తానే కొనుగోలు చేస్తున్నది. ఒకసారి డంకెల్ ఒప్పందం అమలులోకి వస్తే ఈ ప్రోత్సాహకాలు, సబ్సిడీలన్నింటికీ కత్తెర పడుతుంది.

వ్యవసాయోత్పత్తిలో 10 శాతం మించినప్పుడే ఒప్పందంలోని షరతులు వర్తిస్తాయన్నమాట నిజమే అయినప్పటికీ, అది ఆ పరిమితి దాటడం ఖాయం. అసలే వ్యవసాయం గిట్టుబాటు కాక రైతు, ఆహార ధాన్యాల కొరత ఏర్పడి ప్రజలు అలమటిస్తున్నప్పుడు సబ్సిడీలు రద్దు చేస్తే వ్యవసాయ రంగం కుప్ప కూలిపోతుంది. ఒక్క కరెంట్ చాలు - రైతు కొంప లార్పడానికి! పరిశ్రమలు కట్టే టారిఫ్ ప్రకారం బిల్లులు కట్టమంటే ఏ పంట వేసినా రైతుకు గిట్టుబాటయ్యే పరిస్థితి లేదు. పొలాలు బీడు పెట్టి టౌన్‌లలో రిక్షాలు తొక్కుకోవలసిన దుర్గతికి దిగజారి పోతాడు రైతు. రైతు దెబ్బ తింటే వ్యవసాయ కూలీలు ఆకలి చావులకు గురౌతారు. దేశం తీవ్రమైన ఆహార సంక్షోభంలోకి నెట్టి వేయబడుతుంది.

**డంకెల్ ఒప్పందంలో సంతకాలు చేసినందుకు మనదేశం ఎగుమతులు ఒక్క బిలియన్ డాలర్ మేరకే పెరుగుతాయని అంచనా; ఇంత చిన్న మొత్తానికి ఆర్థిక స్వాతంత్ర్యాన్నే తాకట్టు పెట్టడం అవసరమా?**

**కొరియాలో రైతులు ప్రభుత్వం పై తిరుగుబాటు ప్రకటించారు; వీధుల్లోకొచ్చి పోరాడుతున్నారు. మనం మాత్రం మౌనంగా పడబోతున్న ఉరిత్రాడుకు మెడనందిస్తున్నాము!**

రైతుకు ఎదురయ్యే రెండవ సమస్య - విత్తనాలు. పరిశోధనా శాలలు రూపొందించే విత్తనాలను రైతులు తమ పొలాలలో సాగు చేసుకొని, రెండవ పంటకు తమకు సాగు మిగిలినవి తక్కిన రైతులకు అమ్ముకొంటున్నారు. గాట్ ఒప్పందం అమలైతే - రైతులకు ఆ స్వేచ్ఛ వుండదు. విత్తనాలను కేవలం బ్రాండ్ పేరు వున్న కంపెనీల నుంచే కొనాలి. బహుళ జాతి సంస్థలు రైతుల నుంచి వేల కోట్ల రూపాయలు దోచుకొని తింటాయి. ఈ విషయంలో అన్ని వ్యవసాయాధార దేశాలూ అసంతృప్తితో వున్నాయి. కొరియా వంటి దేశాలలో రైతులు అప్పుడే ఉద్యమాలు మొదలు పెట్టారు. సియోల్‌లో రైతులకు మద్దతుగా విద్యార్థులు వీధులలోకి వచ్చి పోరాడుతున్నారు. తమ భవిష్యత్‌కు ప్రమాదమని భావించ బట్టే అక్కడ అంత తీవ్ర ప్రతిస్పందన కన్పిస్తున్నది. మన ప్రభుత్వంలో రైతులలో ఆ వివేకం ఇంకా కల్గలేదు.

గ్రీన్ రివాల్యూషన్‌కు కారణ భూతమైన కొత్త వంగడాలు రూప కల్పన చేసిన మన దేశ పరిశోధనా సంస్థలు పేటెంట్ రైట్స్ వల్ల లాభ పడుతాయన్నది కేవలం కంటి తుడుపు మాటే. కొన్ని కోట్ల మంది రైతులు అధిక ధరలు చెల్లించి విత్తనాలు కొనుగోలు చేయడం ద్వారా బహుళ జాతి కంపెనీలు లాభపడే మొత్తంలో పోల్చినప్పుడు మన వ్యవసాయ పరిశోధనా శాలలు ఆర్జించే సొమ్ము నామ మాత్రమైనదిగా వుంటుంది.

అగ్రదేశాలలో రైతులకు విపరీతమైన సబ్సిడీలున్నాయి కాబట్టి, ఈ ఒప్పందం ప్రకారం అవి తగ్గిపోయి, వారి వ్యవసాయోత్పత్తుల ధరలు పెరిగి మనబోటి దేశాల రైతులు ఎగుమతుల మార్కెట్‌లో పోటీ రేట్లకు తట్టుకొనే పరిస్థితి కల్గుతుందని ప్రచారం చేస్తున్నారు. ఇది వట్టి ప్రచారమే.

వర్థమాన దేశాలు వ్యవసాయోత్పత్తుల మార్కెట్‌లో తమకు పోటీకి రాకుండడం కోసం గాట్ ఒప్పందంలో తెలివిగా - ఫైట్ శానిటరీ స్టాండర్డ్స్, ఎన్విరాన్‌మెంటల్ కన్సర్న్స్ - అనే భాగాన్ని ఇరికించారు. శానిటరీ స్టాండర్డ్స్ రైతులు వాడే తెగుళ్ళ మందులు, వీటి యాజమాన్యం, ఎరువులు తదితర వాటి పై ఆధార పడి వుంటాయి. వాతావరణం పేరుతో వర్థమాన దేశాల నుంచి వచ్చే కలప, పొగాకు, కోకో వంటి ఉత్పత్తులను నిషేధిస్తారు. ఈ రెండు సాకులతో వర్థమాన దేశాల రైతులు తమ రైతులతో పోటీకి రాకుండా నిషేధాలు, ఆంక్షలు విధించే అవకాశం అగ్రదేశాలకు వుంటుంది. ఇప్పటికే నెదర్లాండ్స్ దేశం కలప,

మిగతా 8 పేజీలో

# జమీన్‌రైతు
## జె.పి.సి. నివేదిక

రాజకీయవాదులు - అధికారులు -వ్యాపారులు-ప్రభుత్వరంగ సంస్థల నిర్వాహకుల మధ్య ఎటువంటి హేయమైన అక్రమసంబంధాలు నెలకొని వున్నది కళ్ళకు కట్టింది జెపిసి నివేదిక. ఎనిమిదివేలా మూడువందలా 83 కోట్ల రూపాయల షేర్ మార్కెట్ కుంభకోణంపై గర్జిస్తూ ఎలుక జెపిసి కనీసం కొందరినైనా నిర్దుష్టంగా ఈ తప్పుకు బాధ్యులను చేయగల్గడం సంతోషించ దగిన విషయం. కేంద్ర మంత్రులు, షేర్ బ్రోకర్లు, బ్యాంక్ నేతలు, ఉన్నతాధికారులు, సిబిఐ వంటి నేరపరిశోధనా సంస్థలు, వ్యాపార కంపెనీలు తదితరులందరూ ఈ మహానేరంలో సమభాగస్తులేనని నిర్ధారించింది జెపిసి. ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్ ఈ విషయంలో పార్లమెంట్‌కు బాధ్యుడని స్పష్టంగా పేర్కొన్నది. రిజర్వు బ్యాంకు మాజీ గవర్నర్ ఎస్. వెంకటి రమణన్‌ను నేరస్తుడుగా వేలెత్తి చూపింది. పివి నరసింహారావును వదిలేసినప్పటికీ ఆయన కుమారుడు పివి ప్రభాకర రావు రెండుకోట్ల అప్పు విషయంలో మరింత లోతుగా దర్యాప్తు జరపాలని సూచించింది. స్టేట్‌బ్యాంక్ ఉన్నతాధికార వర్గం బ్రోకర్లతో కుమ్మక్కైన తీరు క్షమార్హం కాదన్నది. సిబిఐ తన నేరపరిశోధనా సరళిలో వ్యవహరిస్తున్న తీరు పట్ల సందేహాలు వ్యక్తం చేసింది. కేంద్రమంత్రులు శంకరానంద్, రామేశ్వర్ ఠాకూర్‌ల నిజాయితీని ప్రశ్నించింది. విదేశీ బ్యాంకులపై కఠిన చర్యలకు ఆదేశించింది. ఒక పార్లమెంటరీ కమిటీ ప్రజాజీవితంలో వుండే వివిధ వర్గాల ఉన్నత స్థాయి వ్యక్తులపైన, సంస్థల పైన ఇంత స్పష్టంగా నేరనిర్ధారణ చేయడం అసాధారణం, అపూర్వం. ఇంతచేసి, జెపిసి దర్యాప్తు కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా వుందన్న ఆరోపణ వినవస్తున్నప్పటికీ, ఈ మాత్రమైనా నిజాలు వెలుగులోకి తేవడం అభినందనీయం.

భారతదేశ చరిత్రలోనే ఇంత ఘోరమైన ఆర్థిక నేరం మరొకటి జరగలేదు; జరగబోదు. కొద్దిమంది బ్రోకర్లు కలిసి 8 వేల కోట్ల ప్రజాధనాన్ని పటిక బెల్లంవలె ఆరగించి వేసిన మహాదారుణ కుంభకోణం ఇది. కొన్ని లక్షల మంది అమాయక ప్రజలలో షేర్ మార్కెట్ పట్ల ఆశ్యాశలు కల్పించి వారి కుటుంబాలను నాశనం చేసిన ఘోర దురంతమిది. ఆర్థిక మంత్రిత్వశాఖ, రిజర్వు బ్యాంకు వంటివి ఏమాత్రం మెళకువగా మెలగివుండినా, జాగ్రత్త పడివుండినా ఇన్నివేల కోట్లు స్వాహా అయ్యేవికావు; అన్ని లక్షల మంది చితికి పోయేవారు కాదు. జెపిసి తన నివేదికలో ఆర్థిక మంత్రికి సంబంధించి అదే పేర్కొన్నది.

ఆర్థికమంత్రి నిర్బాధ్యతగా, నిర్లక్ష్యంగా వ్యవహరించాడని పేర్కొనడమే కాదు, ఆయన పదే పదే సమర్థించిన రిజర్వు బ్యాంకు మాజీ గవర్నర్ వెంకటి రమణన్ హర్షద్ మెహతాకు సహాయం చేశాడని కనుగొనడం ద్వారా జెపిసి మన్మోహన్ సింగ్ పెద్దరికాన్ని బ్రద్దలు చేసింది. ఒక మంత్రికి ఇంత కంటే ఘాటైన చీవాట్లు అవసరం లేదు.

జెపిసికి ఈ దర్యాప్తులో ఇటు ఆర్థిక మంత్రిత్వ శాఖ నుంచి, అటు సిబిఐ నుంచి సహకారం అందక పోవడం అన్యాయం. ఈ మహాదారణ కుంభ కోణాన్ని కప్పి పుచ్చడాన్ని పెద్దలెవరో ప్రయత్నిస్తున్నా రన్న సందేహాన్ని జెపిసి నివేదిక పరోక్షంగా సూచిస్తున్నది. సమర్థవంతము, నిష్పక్షపాతము అయినదిగా పేరొందిన సిబిఐ కూడా హర్షద్ మెహతా కొమ్ముకాస్తున్నదన్న సందేహం కలుగుతూంది. దేశ ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేసిన కుంభకోణం పట్ల నిజాయితీగా వ్యవహరించి, దోషులను పట్టి, ప్రజలలో విశ్వాసం కల్పించ వలసింది పోయి ఎవరికి వారు దోషులతో చేతులు కలిపి కేసు మాఫీ చేయడానికి ప్రయత్నించడం ఘోరాతి ఘోరమైన నేరం.

ఇంకొక ప్రక్క స్కాంలో స్వాహా అయిన 8 వేల కోట్లు ఎవరికి చేరాయన్న విషయం వెలికి తీయడం జెపిసికి అలివి కాలేదు. దీనిపై మరొక దర్యాప్తు జరిపించ మని జెపిసి ప్రభుత్వాన్ని కోరింది. దర్యాప్తుకు ప్రభుత్వం సహకరించి వుంటె ఈ వివరాలు జెపిసికి ఎప్పుడో తెలిసి వుండేవి. నిజాలు దాచిపెట్టే కుత్సితత్వానికి పాల్పడుతున్న ప్రభుత్వం దీనిపై మళ్లీ దర్యాప్తు జరిపిస్తుందన్న నమ్మకం ఎవరికీ లేదు.

జెపిసి చీవాట్లు తిన్న తర్వాత అయినా పివి నరసింహారావు గారు నిర్మొహమాటంగా దోషులపై చర్య తీసుకో గల్గితే ప్రజలకు ఆయన ప్రభుత్వంపై విశ్వాసం కల్గుతుంది. దీనితో పాటుగా ఆయన తన కుమారుడి అవినీతి పై జెపిసి చేసిన వ్యాఖ్యను తీవ్రంగా పరిగణించి, విచారణకు ఆదేశించడం అవసరం. ఆ నిర్ణయం తీసుకో గల్గితే ప్రధానిగా ఆయన ప్రతిష్ట పెరుగుతుంది. జెపిసి నేర నిర్ధారణ చేసిన మన్‌మోహన్ సింగ్‌ను, తక్కిన ఇద్దరు మంత్రులను మంత్రి వర్గం నుంచి తొలగించడం - ప్రజా స్వామ్య ప్రమాణాల పరిరక్షణకు అవసరం. అంతటి విశాల హృదయంతో పివి వ్యవహరించ గలడన్నది సందేహమే!

# జమీన్‌రైతు

24.12.1943

పేజీలు 6, వెల 0-1-6

## నెల్లూరు ముచ్చట్లు

### జిల్లా బోర్డు మీటింగు

పై మీటింగు 31-12-43 శుక్రవారం సా. 4.30 గం.కు నెల్లూరులో జరుగును.

### అజండాలోని ముఖ్యవిషయాలివి

దస్తగిరి సాహెబ్ సభ్యత్వ పునరుద్ధరణ, వెంకటగిరి పంచాయితీబోర్డు సభ్యులు 16లో 14గురు రాజీనామా యిచ్చినపుడు బోర్డును ఎందుకు రద్దు చేయ కూడదు?, చిట్టమూరు పంచాయితీ ఎందుకు ఎత్తివేయకూడదు?, నెల్లూరులో ఫిబ్రవరిలో జరుగబోవు వ్యవసాయ ప్రదర్శనం- పశువుల సంతకు విరాళం. ఓడిపోయిన సన్నపురెడ్డి శేషురెడ్డి కేసులో వకీలు ఫీజు రు.2168లు శాంక్షన్: ఎత్తివేయదలచిన 12 వైద్యశాలలను పునరుద్ధరించుట ఇవి.

### సభ్యులకొక మనవి

కొందరు అటెండెన్సు రిజిస్టరులో జేవ్రాలు పడగానే లేచి వరండాలో తారాడడమో? బజారు సామానులకు పోవడమో, బత్తా బిల్లుల తేభ్యానికి గుమాస్తా చుట్టు తిరుగుచుండడమో జరుగుచున్నది. ఇది చాలా అసభ్యంగా వుంటుంది. ఇట్టివారిని బత్తాలకు మాత్రం వచ్చిన సభ్యులని అవహేళన చేస్తుంటారు. కావున మీటింగు పూర్తి అయ్యేదాకా కూర్చుని, అన్ని విషయాలను అవగాహన చేసుకొని వ్యవహరించమని ప్రార్థన.

### అధ్యక్షులకొక మనవి

కుద్రపెల్లికి మంత్రాలను దిగేసినట్లుగాకుండా, తద్దినపు మంత్రాల మాదిరి పొగగా అబ్బయిక్కే కాదు మాదిరి పరుగెత్తకుండా విషయాలను నెమ్మదిగా చెప్పి వ్యాఖ్యానించి మీటింగును యధావిధిగా నెరవేర్తురని విజ్ఞాపన.

### చిల్లర-జుల్మానాలు

చిల్లర హెచ్చుగా వుంచు కొన్నారని చంద్రభవన్‌కు వేసివుండిన రూ.200ల జుల్మానాను అప్పీలులో కొత్త జడ్జి 18తేది తోసివేసిరి. యడ్లపల్లి శెట్టిగారికి మాత్రం చిలుము బట్టిన దమ్మిడీల మహత్యంతో జుల్మానాను ఖాయం చేసిరి.

### పాత విద్యార్థి సంఘ మీటింగు

**50 ఏళ్ల క్రితం ఈ వారం**

పై సమావేశం 19వ తేది వకీలు పెళ్లకూరు చంద్రశేఖరరెడ్డిగారి అధ్వర్యాన గంటల తరబడి కార్యక్రమ మీమాంస జరిగింది. పాత విద్యార్థుల దినం 2 తేది జరుప తీర్మానించిరి. ఎలక్ట్రిక్ దీపాలు నిద్రబోవడంతో సభ సమాప్తమైంది.

### నెల్లూరు బజారు ధరలు

| | |
|---|---|
| మొలగొలుకులు పుట్టి 1-కి | 147 నుండి 150 వరకు |
| కేసర్లు | 130-0-0 |
| జొన్నలు . | 113-0-0 |
| రాగులు . | 135-0-0 |
| బంగారు సవర (ముద్రాసు ధర) రూ. | 49-6-0 |
| వెండి తులం | 1-3-0 |

### పెళ్లిళ్ల పురాణం

ఇంగ్లీషువారు పెండ్లి సమయంలో వుంగరాలు మార్చు కోవడం సాంప్రదాయం. అలాంటి వుంగరాలు బ్రిటన్‌లో 6 మాసాలకు 2లక్షలా 66 వేలు ఖర్చయ్యేవట. యుద్ధం మూలాన వాటికిగూడ అవకాశం సన్నగిల్లింది. సుప్రసిద్ధ వుంగర నిర్మాతలు 83 వేలకు పైన మేము తయారీ చేసి యివ్వలేమంటున్నారట. అమరిడోరా! ఈలాంటి కంట్రాక్టులనన్నా మా మొహానబారవేస్తె మీకు కావలసినన్ని ఉంగరాలు తయారు చేయించి ఇస్తామే మాగుండాలవారితో చెప్పి. ఈ కూలీగూడా మాకు దక్కడం నీకు యిష్టంలేదు కాబోలు?

### సినిమా ప్రపంచం

#### మంగమ్మ

ఈ మధ్య ఆంధ్రదేశములో తమిళ ఫిలిముల చలామణీ జాస్తి అయింది. నాగయ్య ధర్మాన తెనుగు చిత్రాలలో, అరవదేశంలో పేటెంటు చేయబడిన హాస్య నటచక్రవర్తులు యన్.యస్.కృష్ణన్, టి.యం. మధురముల ప్రవేశపెట్టడంతో మరికొంత ప్రచారానికి ఆస్కారమైంది. వీరిద్దరి హాస్యం లేని అరవ ఫిలిమే లేకుండా వచ్చింది.

ఈ పరిస్థితులలో తెనుగు మంగమ్మను అరవ ఫిలిములో కథావస్తువుగా ఏరుకోవడంతో మరికొంత అవకాశంగూడ దొరికింది. ఈ కారణాలతో ఆంధ్రదేశమంతటా జెమినీవారి మంగమ్మ పేరు మారుమ్రోగుతున్నది. ఇక యీ చిత్రం ఎలా ఆంధ్రలోకానికి నచ్చుతుందో ముందుచూస్తాం.

# బాబాల మహిమలు నమ్మవద్దు!

పుట్టపర్తి సాయిబాబా హస్త లాఘవాన్ని వివరిస్తూ మీరు 'సణుగుడు' శీర్షికలో గతవారం చేసిన విశ్లేషణ సంభ్రమాశ్చర్యాలను గొల్పింది. అణిమాది సిద్ధులు గలిగిన యోగులకు, సన్యాసులతో పాటు బాబాలకు వుండే మహిమల గూర్చి మీరు తార్కికంగా చెప్పిన విషయాలు కొందరు మూఢ భక్తుల లోనైనా మార్పు తెస్తుందని భావిస్తున్నాను. ప్రతి ఒక్క భక్తుడూ బాబాల మహిమలు లోకానికి ఎంత వరకు వుపయోగ కరమో ఆలోచించి వీరిని ఆరాధించడం మంచిదేమో! శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో క్షుద్ర విద్యలతో, సిద్ధ శక్తులతో చూపే మహిమల లోని తేడాని ప్రజలు గమనిస్తుండాలని మనవి.

నెల్లూరు -పి. కోటయ్య

## మాట పై నిలువని ఎన్టీఆర్

ఎన్టీ రామారావు గారు నేషనల్ ఫ్రంట్ ఛైర్మన్ పదవికి ఇటీవల రాజీనామా చేశారు. అది వున్నా ఒకటే, వూడిన ఒకటే. వార్తల్లోకి ఎక్కడానికే ఆ పని చేశారు. వుత్తరాదిన కాంగ్రెస్ గెలిస్తే తెలుగు దేశం అధ్యక్ష పదవికి రాజీనామా చేస్తానన్న వ్యక్తి ఫలితాలు వెల్లడైన తరువాత మాట మార్చాడు. జనవరి 7 తేదీ నెల్లూరులో జరిగే రాష్ట్ర మహిళా సదస్సులో సంచలనం సృష్టించను పార్టీ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి పార్వతికి అది కట్ట బెట్టినా ఆశ్చర్య పోనక్కర్లేదు.

నెల్లూరు -యద్దనపూడి సరోజిని

## జనవాణి

### మంత్రులు కూడా పొదుపు పాటించాలి

సారా నిషేధం వల్ల ప్రభుత్వ ఖజానాకు కోట్ల రూపాయలు గండి పడిన విషయం అందరికీ తెలును. అందుచేత పొదుపు చర్యలు చేపట్టి వుద్యోగుల కిచ్చే పలు ప్రోత్సాహకాల పై కోత విధించారు. ప్రభుత్వం కష్ట కాలంలో వున్నప్పుడు ఈ చర్య సహేతుకమైనదే. కాని ప్రభుత్వానికి బాధ్యత వహించే మంత్రులు ఈ క్లిష్ట సమయంలో ఎటువంటి పొదుపూ పాటించడం లేదు. పర్యటనల సమయాల్లో హడావుడి, కొత్తగా చేరిన గృహాల అలంకరణలు, విందులు, వినోదాలకు దండిగానే ఖర్చు పెడుతున్నారు. వీరి జీతాలతో పాటు, ఎమ్మెల్యేల జీతాలూ పెంచుకున్నారు. ఇదేమి న్యాయం చెప్పండి!

కావలి -వి.వి. నరసింహా చార్యులు

### సెక్స్ గూర్చి వైద్యులు చెప్పనక్కర్లేదు.

'జమీన్‌రైతు' లో ఇటీవల సెక్స్ మీద మక్కువ వుండే డాక్టరు గారు తరచూ సెక్సు పరిజ్ఞానాన్ని తెలియ జేస్తున్నారు. వాటిని చదివి ఓ పాఠకుడు భారతీయులు వాత్సాయనుని నుంచి సెక్స్ వారసత్వం పుచ్చుకొన్నారని సెలవిచ్చారు. కాని వాస్తవ దృక్పథంతో ఆలోచిస్తె విజ్ఞాన పరమైన సెక్సు విధానంలో అనుభూతి పొందే దుస్థితి భారతీయులకు లేదు. ఉష్ణ దేశీయులైన భారతీయులకు ప్రకృతి సిద్ధంగానే సెక్సు తీరు అబ్బిందని చెప్పవచ్చు. శాస్త్ర పరంగా, సెక్సు విద్య నేర్పిందే అనుభూతులు పొందక సంసారాలు కుప్ప కూలి పోవడం లేదు. ఆర్థిక పరిస్థితుల మూలంగానే ఇవి జరుగు తున్నాయన్నది జగమెరిగిన సత్యం.

కొరవ 10 పేజీలో

# పదవులు రాకపోయినా ప్రజా హృదయాల్లో చిరంజీవి!

ఒక వ్యక్తి నిస్వార్థ సేవను ప్రజలు నిరంతరం తమ హృదయాల్లో నిక్షిప్తం చేసుకొని తగిన సమయంలో దాన్ని వెల్లడిస్తారన్న విషయం 19 తేదీ ఇందిరాభవన్‌లో జరిగిన ఆచార్య పి.సి. రెడ్డి 77 వ జన్మదినోత్సవం నాడు తేట తెల్లమయ్యింది. అభిమాన ధనం ముందు అధికార దాబు, దర్పం ఏమాత్రం పనికి రావని స్పష్టమైంది. సమయం కాని సమయంలో పెట్టిన సభకు స్వచ్ఛందంగా తరలి వచ్చిన ఆత్మీయులు పిసి రెడ్డి దంపతులను వందలాది పుష్పమాలలు, పట్టు బట్టలు, ఉత్తరీయాలలో ముంచేత్తారు. ధవళ కాంతులీనే బట్టలు, నుదుటన సింధూరం ధరించిన శ్రీ పెళ్లకూరు చంద్ర శేఖర రెడ్డి ముఖారవిందాన మళ్లీ పెళ్లి కళ కొట్టొచ్చినట్లు కనపడింది.

జన్మదిన అభినందన వేదికపై డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి, ప్రభుత్వ విప్ శ్రీ సివి శేషారెడ్డి, న్యాయవాది శ్రీ ఎం. సుందరాచారి వంటి పెద్దలు ఆశీనులయ్యారు. అధ్యక్ష స్థానం అభినంద కమిటీ అధ్యక్షులు రొటేరియన్ వామ్మిన సుబ్రమణ్యం గారిది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అభినందన సందేశానిస్తూ పి.సి. రెడ్డి ఎప్పుడూ ప్రభుత్వ పదవుల కొరకు

> ## పిసి రెడ్డి అభినందన సభలో ప్రశంసలు!

ఆరాట పడలేదు; అధికారాల కొరకు అర్రులు చాచని, నిష్కలంక ప్రజాసేవకుడని ప్రసంసించారు. 76 ఏళ్లు నిండినా ఆయనలో తగ్గని వుత్సాహం అబ్బుర పరస్తుందని చెప్పారు. పి.సి. రెడ్డి జీవితానికి సంబంధించిన స్మృతులు, అనుభూతులు పునకాని ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి ఆవిష్కరించి అనంతరం మాట్లాడారు. పెళ్లకూరు వంశస్థుల గూర్చి నాకు నేనే చెబితే బాగుండక పోయినా పి.సి. రెడ్డి కార్మిక కర్షకులకు ఆప్తుడు. వికలాంగులకు మార్గదర్శి, విధివంచితులకు వేగుచుక్క, కుష్టువారికి కులదైవం. వయస్సులో నాకన్నా పెద్ద అయినా నన్ను 'అన్న' అంటూ నాకంటె చిన్నవాడుగా కనిపిస్తూ చురుకుగా పనిచేస్తుంటారు. అభినందన సభలో పాల్గొన డానికి ముందు విజయమహల్ గేటు మీదుగా వస్తూ ప్రజలు పడుతున్న పాట్లు ప్రత్యక్షంగా చూశాను. అక్కడ బాక్స్‌టైప్ బ్రిడ్జ సత్వర నిర్మాణానికి ఢిల్లీస్థాయిలో ఏ సహాయానికైనా సిద్ధమంటూ హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. శ్రీ సి.వి. శేషారెడ్డి శ్రీ పి.సి. రెడ్డి జిల్లాలో పలు వుద్యమాలకు వూపిరని, వ్యక్తిగాక శక్తియని శ్లాఘించారు. న్యాయవాది శ్రీ సుందరాచారి సుదీర్ఘ ప్రసంగంలో శ్రీ

కొరవ 10 పేజీలో




77 వ జన్మదినాన కొత్త పెండ్లి కొడుకులా సతీమణితో కలిసి వేదిక పై వెలిగి పోతున్న పిసిరెడ్డిని అభినందిస్తున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి. పక్కనే న్యాయవాది సుందరాచారి కూడా వున్నారు.

# స | ఋ | గు | డు

## * సత్యసాయి భక్తులు జమీన్‌రైతు పై అక్కసుతో ప్రతులు ధ్వంసం చేశారు!

సత్యసాయిబాబా గారడీ విద్యలపై గతవారపు మా వార్త, విశ్లేషణ బాబా భక్తులను కలవర పరచినట్లుంది. తాము దేవుడిగా నమ్మే వ్యక్తి నిజస్వరూపం ఇదని ప్రజలు గ్రహిస్తే ఆయనపై భక్తి ఎక్కడ తగ్గి పోతుందో, తాము మహత్తులుగా ప్రచారం చేసేవి కేవలం కనికట్టు విద్యలని పదిమందికి తెలిస్తే ఎక్కడ చులకనైపోతామోనని వారు భయపడిపోయి నట్లున్నారు. ఏమి చేయాలో తోచక అసహనంతో, కోపంతో జమీన్‌రైతు ప్రతులను హోల్‌సేల్‌గా కొని దహనం చేసేశారు. బంకుల్లో పత్రిక కన్పడనివ్వకుండా చేశారు.

బాబా భక్తులను చూస్తే నాకు జాలివేస్తున్నది. వారెంత బలహీనులో అర్థమై అయ్యో అన్పిస్తున్నది. నూటికి మించిన దేశాలలో భక్తులున్నారన్న ప్రచారం కల్గిన ఒక స్వామీజీకి; దేశాధి నేతలు, కోట్లాధిపతులు, మహామహా కొమ్ములు తిరిగిన మేధావుల చేత కాళ్లకు మ్రొక్కించుకో గల్గిన తెలివైన స్వామీజీకి, వారి శిష్య పరివారానికి ఒక స్థానిక పత్రిక వార్తలు వణుకు పుట్టించాయంటే జాలి తప్ప ఇంకేమి కల్గుతుంది చెప్పండి?

భక్తి విశ్వాసాలు వ్యక్తిగతమైనవి. ఎవరిష్టం వచ్చిన, ఎవరికి గురి కుదిరిన రీతిలో వారు

> ### డోలేంద్ర

తమకు నచ్చిన వారిని ఆరాధించవచ్చు, పూజించవచ్చు. వాటిలో వేలు పెట్టే హక్కు పత్రికలకే కాదు, ఎవరికీ వుండదు. కాని, తమకు నచ్చని విషయాలు, అవాస్తవా లైనప్పటికీ, ప్రచారం కాకూడదని భావించడం మూర్ఖత్వం. డబ్బుపెట్టి బంకుల్లో పత్రికలు కొని దహనం చేసినంత మాత్రాన కొన్ని నిజాలు ప్రజలకు చేరకుండా పోవు. ప్రజలకు వార్త ఏ దారిలో చేరాలో ఆ దారిన చేరుతుంది.

కొరవ 10 పేజీలో

# చేంతాడంత లెక్కలకు చిటికెలో సమాధానం!

మేధావులు, కవులు, కళాకారులు, ప్రతిభావంతులను గౌరవించడంలో సింహపురీయులు ఎప్పుడూ ముందుంటారు. కాని ప్రపంచంలోనే అత్యంత మేధావులైన వారిలో ఒకరై, గణిత బ్రహ్మగా గణుతి కెక్కిన డాక్టర్ సంజీవరాయశర్మను మాత్రం నెల్లూరులోని సమాజాలు, సంఘాలు, సాంస్కృతిక సంస్థలకు ఆయన గుర్తు కొచ్చినట్లు లేదు. ఆలస్యంగానైనా 'కళాసుధ' శ్రీ సంజీవరాయశర్మను 20 తేదీ టౌన్‌హాలుకు రప్పించి, ఇంతవరకు అక్కడక్కడా వినడమేగాని చూడని

> ## నెల్లూరు సంగతులు

గణితావధాన ప్రక్రియ పట్టణ ప్రజలు చూసే భాగ్యం కల్పించింది. ఎనభైఐదేళ్ల వార్ధక్యంలో శరీరం వడలి పోయిందేమోగాని తన మేధాశక్తికి కంప్యూటర్ కూడా పాటిరాదని శ్రీ సంజీవరాయశర్మ మరోసారి చాటారు. డాక్టరేట్లు పొందిన పృచ్ఛకులు ఏ బడికి వెళ్లని ఈ మేధావిని చిక్కుల్లో పెట్టాలని చాంతాడంత లెక్కలతో వచ్చినా ఆయన చిటికెలో చెప్పిన సమాధానాలకు చిత్రయ్యారు. టౌన్‌హాల్‌లో ఇప్పటి వరకు జరిగిన సభల్లో ఏసభకూ రానంత మంది అన్ని తరహా ప్రేక్షకులతో హాలులో ఇసుక వేస్తె రాలనంత పరిస్థితి ప్రత్యక్షమైంది. క్యాలుకులేటర్ చేబట్టి వచ్చిన వారు ఒకటీ రెండు అంకెలు మీటేలోగా ఆయనిచ్చిన సమాధానాలకు ముగ్ధులై

> ## నెల్లూరులో మానవ కంప్యూటర్ సంజీవ రాయ శర్మ గణితావధానం!

చప్పట్ల వర్షం కురిపించారు. సంజీవ రాయశర్మపై సింహపురీయులు ఎంతటి అభిమానం చూపారంటె ఆయన వాస్తవ పరిస్థితి చెప్పేసరికి తట్టుకోలేక పోయి హాలులోవున్న ప్రతిఒక్కరూ ఆ మహామేధావికి తమజేబుల్లో ఎంత వుంటె అంత ఇచ్చి ఒక మేధావికి ప్రభుత్వం ఇచ్చే ప్రోత్సాహం ఇదా అంటూ బయటకు రావడం కన్పించింది. కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన జిల్లాజడ్జి శ్రీ ఇస్మాయిల్, సంజీవ రాయశర్మను కంప్యూటర్‌ను మించిన సూపర్ కంప్యూటర్ అని శ్లాఘిస్తూ, వెంకటేశ్వర యూనివర్సిటీ ఆయనకు డాక్టరేట్ నిచ్చి తనను తాను గౌరవించుకొందన్నారు. శ్రీ నంవిసంజీవ రాయ శర్మ అసమాన ప్రతిభను ప్రత్యక్షంగా అవధానం పూర్తయ్యే వరకు జడ్జిగారు వేదికపైనే ప్రేక్షకుడై పోయారు వుండారు.

ప్రధాన పృచ్ఛకులు డాక్టర్ బాలకృష్ణారెడ్డి 18.5.1931 ఏ సంవత్సరం, వారం, తిథి, నక్షత్రమంటూ అడుగుతుండగానే ప్రజోత్పత్తినామ సంవత్సరం, సోమవారం, శుద్ధ పాడ్యమి; రోహిణి నక్షత్ర మంటూ సెకనులో సమాధానం చెప్పారు. 3,56,95,684 సంఖ్యకు

కొరవ 11 పేజీలో

## 'మనిషి జీవించడానికే పుట్టాడు'

# వజ్రశకలాలు

150 పేజీల పుస్తకమిది. జర్మన్ మహాకవి గాథే దర్శనం అని పుస్తక నామాంతరం. తన సాహిత్య, వ్యక్తిగత జీవితంలోని ఒడిదుడుకుల్లో, తీవ్ర మానసిక సంక్షోభానికి గురయినప్పుడు, తన జీవితానికి ఒక అర్థాన్ని, ఆనందాన్ని సమకూర్చినవాడు గాథే కవియని, ఆ కవి వల్లనే తన మానసికాందోళన శమించిందని రచయిత తెలుపుతున్నాడు. గ్రంథనామం 'వజ్ర శకలాలు' అని వుంచడంలో గాథే కవి చెప్పిన నిర్వచనాలు, కొటేషన్లు వజ్రములవంటివని కవి అభిప్రాయం. సౌందర్యభరితమైన విశాల ప్రపంచాన్ని పూజించమనీ, మనుష్యులను ద్వేషించక ప్రేమించడంలోనే ఆనందమున్నదనీ, ప్రకృతి పొత్తిళ్లలో పసివాడిలా పరవశించమని గాథే చెప్పాడు.

అసంపూర్ణ ప్రపంచంలో ఆనందంగా జీవించడమే నిజమైన మనిషి

> ### గ్రంథసమీక్ష
>
> \- రచయిత
>
> సౌభాగ్య
>
> సమీక్షకుడు
>
> సురభి నరసింహం
>
> ప్రతులకు
>
> సిస్టమ్స్ ఆడిట్ డిపార్టుమెంట్
>
> హెచ్.ఎ.ఎల్. బాలానగర్
>
> హైదరాబాద్ - 500 042.
>
> వెల రూ. 40/-

ధ్యేయమనీ, ప్రేమపూరితుడైనవాడే పరిపూర్ణమానవుడనీ, కళాకారుడికి ఉండాల్సిన ప్రాథమిక మౌలిక లక్షణం ప్రేమ అనీ, గాథే అభిమతం. వ్యక్తి ప్రశాంతంగా, నిరంతరం తన కార్యక్రమాల్ని ఎట్లా కొనసాగించవచ్చో గాథే కల్పించాడంటాడు రచయిత.

గాథే కవిత్వాన్ని మానవజాతి అదృష్టంగా భావించాడు. నిజమైన కవిత్వం తన ఆంతరంగిక నైర్మల్యంద్వారా, బాహిరమైన ఉల్లాసంద్వారా, నిష్ప్రాకృక మనోహర ఆశాజనక గానంలా, మనల్ని యీ ప్రాపంచిక నిర్బంధాలనుంచి విముక్తం చేసే అధికారపూర్వక ప్రకటనలా వుండాలని గాథే అంటాడు.

కవి లక్ష్యాన్ని గూర్చి, 'తనకు చేతనైనంతవరకూ ప్రపంచానికి తోడ్పడగలిగేవాడూ, తన అనుభవానికి వచ్చిన ప్రపంచాన్ని వ్యక్తపరచ కలిగేవాడు కవి' అంటాడు.

కొరవ 10 పేజీలో

# తూనికల్లో అవినీతికి పరిమితేలేదు!

అవినీతి నూరు పువ్వులు, ఆరు కాయల్గా విరాజిల్ల డానికి కారకులు ప్రభుత్వాధికార్లన్నది జగమెరిగిన సత్యం. కాలదోషం పట్టిన కాటాలు, అరిగిన రాళ్లు, చిల్లులు పడ్డ బుడ్లు, కుదించుక పోయిన మీటరు దబ్బలు, ఝామ్మని తిరిగి పోయే పెట్రోలు మీటరు పంపుల మాటున వెయింగ్ సర్వీసుల వారితో ఘనత వహించిన తూనికల కొలతల శాఖాధికార్లు చేతులు కలిపి లక్షలాది రూపాయలు భోంచేస్తూ ప్రభుత్వానికి నామం పెడుతున్నారు. ఈ అవినీతి ఎంత తారాస్థాయిలో వుందంటే, తూనికలు, కొలతలు సరి చూసి విధించే ఛార్జిలో ప్రభుత్వానికి కేవలం ఒక భాగం మాత్రం జమ చేసి, వ్యాపారస్థులను అదమాయించి దొంగ బిల్లులిస్తూ వసూలు చేస్తున్న ముడుపుల్లో మిగిలిన మూడు భాగాలనూ అధికార్లు, వెయింగ్ సర్వీస్ ఏజెన్సీల వారు సమంగా పంచుకొంటున్నారు. ఒక సంవత్సరం ఎవరైనా తూనికలు కొలతలు సరిచూపక పోతే వేలాది రూపాయలు ఫైన్లు విధించి కోర్టులకు ఈడ్పించి వ్యాపారస్తులను నానా విధాలుగా హింసించే అధికార్లు వెయింగ్ సర్వీసులతో కుమ్మక్కై వారిచ్చే దొంగ బిల్లుల ఆధారంగానే ప్రభుత్వ ఛార్జిలను విధిస్తుండడం పరిపాటై పోయింది. ఈ అక్రమ సంబంధం వల్ల వ్యాపారస్తులే కాకుండా తుప్పు పట్టిన కొలతల పరికరాలతో కొలచిన వస్తువులను బహిరంగ మార్కెట్‌లో కొనుగోలు చేసే ప్రజలు కూడా ప్రభుత్వ ముద్ర ముసుగులో నష్టపోతున్నారు. నెల్లూరు ఎస్‌పిగా

ఇంతకు మునుపు ప్రతిభా వంతంగా పనిచేసి పేరు తెచ్చుకొన్న శ్రీరాములు రాష్ట్ర స్థాయి కంట్రోలర్‌గా వున్నా ఈ శాఖను కంట్రోలు చేయడం ఆయన కలిపి కావడం లేదంటే అవినీతి ఎంత వేళ్లూనుకొని వుందో వూహించు కోవచ్చు.

మార్కెట్‌లో కొనే వస్తువుల కొలతల్లో, బరువుల్లో పరిమాణాలు తగ్గి ప్రజలు మోస పోకూడదని ప్రతి జిల్లాలో డివిజన్ స్థాయిలో తూనికలు, కొలతలు నియంత్రించడం కోసం ఒక కార్యాలయం ఏర్పాటు చేసింది ప్రభుత్వం. అక్కడ ఒక ఇన్స్‌పెక్టర్‌ను పెట్టడంతో పాటు ఒక జూనియర్ అసిస్టెంట్, ప్యూన్, వాచ్‌మెన్‌లను సమకూర్చింది. జిల్లాలో నెల్లూరుతో పాటు గూడూరు, కావలిలలో ఈ

కొరవ 7 పేజీలో

## రేట్లలో ఇంత తేడా ఎందుకు?

ప్రభుత్వం విధించే వెరిఫికేషన్ ఛార్జికి వెయింగ్ సర్వీసులు దోపిడీ చేసి వసూలు చేస్తున్న ఛార్జి పట్టికలో పరిశీలిస్తే తెలుస్తుంది.

| పరికరాలు | ప్రభుత్వానికి చెల్లేది (డిశంబర్ 93 కొత్త విధానం ప్రకారం) | వెయింగ్ సర్వీసులు దోచేది |
|---|---|---|
| 50 కేజీల బరువు రాయి నుండి కేజీ రాయి వరకు | 4 రూ. | 16 రూ. |
| 500 గ్రా. నుండి 1 గ్రా వరకు | 2 రూ. | 12 రూ. |
| 100 కేజీల కాటా | 15 రూ. | 80 రూ. |
| 50 కేజీల నుండి 10 కేజీల కాటా | 10 రూ | 40 రూ. |
| 5 కేజీల నుండి 1 కేజీ కాటా | 6 రూ. | 25 రూ. |
| 20 లీటర్ల క్యాన్ నుండి 10 లీ. వరకు | 6 రూ. | 30 రూ. |
| మీటరు బద్ద, అరమీటరు బద్ద | 3 రూ. | 12 రూ. |
| ప్లాట్‌ఫారం కాటా (300 Kg) | 50 రూ. | 300 రూ. |
| కౌంటర్ మిషన్లు (20 కేజీ - 1 | 15 రూ. | 75 రూ. |
| పర్సనల్ వెయింగ్ మిషన్లు | 30 రూ. | 150 రూ. |
| బులియన్ కాటాలు (కిలో - 500 గ్రా) | 30 రూ. | 200 రూ. |
| 500 గ్రా. - 1 గ్రా | 7 రూ. | 30 రూ. |

# వీధిన బడ్డ జవహర్ భారతి కాలేజి హాస్టళ్లు

వున్నత విద్యా ప్రమాణాలు, క్రమశిక్షణకు రాష్ట్రంలోనే పేరెన్నిక గన్న కావలి జవహర్ భారతి కళాశాల యాజమాన్యం. హాస్టళ్ల నిర్వహణలో విఫలమవడంతో వీధికెక్కింది. విద్యార్థుల కడుపుకొట్టి సాగించిన ఈ కుంభకోణంలో తిలాపాపము 'తలాపిడికెడన్నట్లు' పలుసంఘటనల వల్ల తేటతెల్లమవుతుంది. నలభీమ పాకాలు వడ్డించే విస్తర్లుగా, ఒకప్పుడు; ఇప్పుడు ఎన్నో 'ఇజాలకు' కేంద్ర స్థానంగా ఈ హాస్టళ్లు పేరు గాంచాయి.

### జిల్లావార్తలు

మేడిపండులా సజావుగా సాగుతున్న ఈ విశ్వోదయా హాస్టలు బి విభాగంలో గుమాస్తాగా పని చేస్తున్న కె. రమాపతి అవినీతికి పాల్పడి లక్షలు గడించాడన్న ఆరోపణలు రావడం జరిగింది. ప్రాథమిక విచారణ జరిపామంటూ రమాపతిని సస్పెండు చేసి చేతులు దులుపుకొంది యాజమాన్యం. కాని ఒక గుమాస్తా వార్డెన్లు, చీఫ్‌వార్డెన్ల సహకారం లేకుండా ఎలా తింటాడు - అందరిపై విచారణ జరిపించమని విద్యార్థి

కొరవ 8 పేజీలో

## ఉత్తరక్రియలు...

మా సోదరుడు

# పులిం రవిరాజ



అధ్యక్షులు, నెల్లూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంక్ ఉద్యోగుల అసోసియేషన్

నెల్లూరు మాజీ మునిసిపల్ వైస్ ఛైర్మన్ స్వర్గీయ పి.వి. సుబ్బారెడ్డి గారి కుమారుడు

15.12.93 బుధవారం స్వర్గస్థులైనారు.

పెద్ద కర్మ : **29.12.93** బుధవారం,

నెల్లూరు, రామలింగాపురం, 16/2663 లోని

మా స్వగృహమున జరుగును.

డా. పులిం గోపాల రెడ్డి

మరియు

కుటుంబ సభ్యులు

## నెల్లూరు వాలుచ్చెట్లు
### విమర్శకుడు

### పెంచలయ్య

జిల్లా మంత్రి శ్రీ పసల పెంచలయ్య 25 తేది వస్తున్నారు; 26 తేది తిరిగి వెళ్తారు.

### మాదాల

మునిసిపల్ మంత్రి శ్రీ మాదాల నరసింహారెడ్డి 26 తేది ఉదయం వచ్చి, సాయంత్రం రైలెక్కుతారు.

### తులసీదాస్

పిసిసి అధ్యక్షుడు శ్రీ మట్టి తులసీదాస్ 26 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఉదయం ఇందిరా భవన్‌లో కార్యకర్తల సభ; సాయంత్రం కావలిలో ఐక్య కమ్యూనిస్టు పార్టీ మహాసభ; అట్నుంచి అటే తిరుగు ప్రయాణం.

### డిఆర్ఓ బదిలీ

నెల్లూరు డిఆర్ఓ శ్రీ సత్యనారాయణను బదిలీ చేసి, చిత్తూరు డిఆర్ఓ శ్రీ జి. నారాయణను ఇక్కడ నియమించారు.

సత్యనారాయణ గారు నెల్లో నాలుగేండ్లే అధికారి. తాసిల్దారు నుంచి డిఆర్ఓ వరకు నెల్లూరులో ఎన్నో సంవత్సరాలు పనిచేసినా ఒక్క వివాదమూ లేని అతిమంచివారు. బ్రతకతమూ చేతకానివారు.

కొత్త డిఆర్ఓ గారు కూడా భేషజం లేని సౌమ్యుడుగా కన్పడుతున్నారు; తినబోతూ రుచి అడగడమెందుకు?



### చెల్లనేరదు

నెల్లూరు పట్టణ మునిసిపల్ పరిధిలోని కొండాయపాళెం గ్రామ సర్వే నెం. 411/బి. యు 0.47 సెం. ఇండ్ల ప్లాట్లుగా కొండాయపాళెం గ్రామ పంచాయితీచే మంజూరు కాబడి యున్న మెట్ట భూమిని, చల్లా ధరణి అను నేను వేదాయపాళెం గ్రామ కాపురస్తుడు శ్రీ పగడాల రమణారెడ్డి, S/o. మల్లారెడ్డి గారి వద్ద నుండి 18.9.1987 తేదిన, కొనుగోలు చేసి, ఆ దినమే సదరు భూమిని నేను స్వాధీనము చేసుకొని, ప్రతి సంవత్సరం ప్రభుత్వమునకు చెల్లించ వలసిన శిస్తులు నేనే చెల్లించుచూ, దాన విక్రయములకు సర్వ హక్కులతో అనుభవించు చున్నాను.

పై భూమిని ఎవ్వరూ అమ్ముటకు, అన్యాక్రాంతము చేయుటకు అధికారము లేదు. ఎవరైనా కొన్ననూ, యీ భూమికి సంబంధించి ఎలాంటి లావాదేవీలు జరిపిననూ, చెల్లదని ఇందు మూలముగా అందరికీ తెలియ పరచుచున్నాను.

\- చల్లా ధరణి

రామ్‌నగర్, ఎంటిబ్రదర్స్ ఎదురుగా,
దర్గామిట్ట, నెల్లూరు - 3.

### మహిళా సదస్సు-నాయకుల సిగపట్లు

7 తేది నెల్లూరులో జరగనున్న తెలుగుదేశం మహిళా సదస్సుకోసం మహిళల సంగతేమోకాని మగ నాయకులు మాత్రం సిగపట్లు పడుతున్నారు. రాజమండ్రి, కర్నూలు, నల్గొండ సదస్సుల విజయం తర్వాత నెల్లూరు సదస్సు అయితీరుతుందన్న నమ్మకం వుంది కాబట్టి ఆ క్రెడిట్ కొట్టేయడం కోసం అందరూ తాపత్రయ పడుతున్నారు. ఎవరికి వారు మొత్తం భారం తామే మోస్తున్నట్లు జనానికి కన్పడాలని తంటాలు పడుతున్నారు. సదస్సుకు మూడువారాల ముందుగా నెల్లూరు టౌన్‌లో గోడలనేవి ఖాళీ లేకుండా చేశారంటే అదే కారణం. గోడలమీద అన్నగారు, అమ్మగార్ల కంటే ప్రాయించిన వారి పేర్లు లోల్డుగా వున్నాయి. గోడలను ఖరాబు చేయడంలో కోవూరు ఎమ్మెల్యే శ్రీ నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి 'ఫస్ట్ మార్కు'లు కొట్టేశాడు. సాధారణంగా ఇటువంటి జిమ్మిక్కుల్లో నంబరువన్‌గా వుండాల్సిన రమేష్ రెడ్డి వెనుకబడిపోయారు. ఆ కొరత తీర్చడానికి రమేష్‌రెడ్డి లక్ష్మీ పార్వతి కోసం ఒక్కొక్కటి పన్నెండు వేలు విలువచేసే రెండు కంచిపట్టుచీరలు తెప్పించాడట; అన్నగారికి ఒక బంగారు దండ ప్రజంట్ చేయబోతున్నారు.

నిర్వహణలో పెత్తనం కోసం సోమిరెడ్డి, డేగాల మధ్య రసవత్తరమైన పోరు జరుగుతూంది. సర్వేపల్లి స్పర్ధ ఈ రూపంలో ప్రతిఫలిస్తున్నట్లుంది- వారి ఉక్రోషం చూస్తుంటే! డేగాకు రాపూరంటే విరక్తి, సర్వేపల్లి పైనే రక్తి; అది తన స్వంతమని, తామే పోషిస్తున్నానని చంద్రమోహన రెడ్డి పంతం. అబూచాలు లేకుండా కొడుకు పేరు పెట్టినట్లుంది వీరి నియోజక వర్గాల పోట్లాట.

సదస్సుకు స్టేజీ, మైకులు, లైట్లు, పూలదండలు అన్నీ నేనే తెస్తాను, పదిలక్ష లిచ్చేందన్నాడట, ఎన్టీఆర్; ఫైనాన్స్ కమిటీలోని సభ్యులు తలా పదివేలు చందాలు వేసుకొని మూడు లక్షలు ఇచ్చారు. ప్రసన్న కుమార్‌రెడ్డి, చంద్రమోహన రెడ్డి వంటి వారు అదనపు మొత్తాలు ఇచ్చారు. పడిక ఎంత తక్కువ పడితే అంత రేగా ఇవ్వాలని అన్నగారు హుకుం చేశారట. అన్నగారి చేతికి ఎంత ఇస్తారో, వీరెంత తింటారో మనకు తెలియదు కాని టౌన్‌లో దందకాలు మాత్రం జోరుగా జరుగుతున్నాయి.

ఇంతకీ ఈ తెలుగు మహిళా సదస్సులో మహిళల పాత్ర ఏమిటంటారా- అన్నగారి కాళ్లు కడిగి, హారతు లివ్వడం, అమ్మగారికి వీవనలు వీచడం; అంతకు మించి ఒక్క మహిళకూ సదస్సులో పాలుపంచుకొనే అవకాశం కల్పిస్తున్నట్లు కన్పించడం లేదు.

### ట్రాఫిక్ మార్పులు

కొత్త ఎస్.పి శ్రీ రమణమూర్తి టౌన్ ట్రాఫిక్‌లో స్వల్ప మార్పులు చేశారు. ట్రంకురోడ్డులో ఇక నుంచి బస్సులు, లారీలు బంద్. అవన్నీ రాను, పోను కూడా కనకమహల్ రోడ్డును వాడాలి. ట్రంకురోడ్డులోనూ ఒనవేలేరు- కార్లు, సైకిళ్లు వగైరా రెండు ప్రక్కలా రావచ్చు, పోవచ్చు. శ్రీరామా ఆఫ్సెట్స్ దగ్గరున్న టౌన్ బస్‌స్టాప్‌ను గాంధీబొమ్మ పెట్రోలు బంకు వద్దకు మార్చారు; పెట్రోలు బంకులోని ఆటోలు, ట్యాక్సీల స్టాండ్‌ను బ్యాంకు గోడవద్దకు జరిపారు.

నెల్లూరు రోడ్లు ఇరుకు; వాటిని వెడల్పు చేయడమో లేదా నేషనల్‌హైవేకి సమాంతరంగా అటు ఇటు ప్యారలల్ రోడ్లు అభివృద్ధి చేయడమో జరిగితే తప్ప ఎన్ని మార్పులూ ట్రాఫిక్ సమస్యను తీర్చలేవు. అధికారులేమి చేస్తారు, పాపం!

### ఏసిబి వలలో రీకో ఎం.డి

నెల్లూరు ఏసిబి అధికారులు

## తూనికలు కొలతలు

( 5 వ పేజీ తరువాయి )

కార్యాలయాలు పని చేస్తూ వున్నాయి. జిల్లా మొత్తాన్ని పర్యవేక్షించేందుకు సీనియర్ ఇన్స్పెక్టర్ ప్రకాశం జిల్లా పరిధిని కూడా పరిశీలిస్తుండగా అసిస్టెంట్ కంట్రోలర్ కూడా నెల్లూరు కార్యాలయంలోనే వుంటారు. ప్రతి సంవత్సరం తమ పరిధిలోని అన్ని రకాల వ్యాపార సముదాయాల్లోని తూనికలు, కొలతల వస్తువులను పరిశీలించి, అవసరమైన వాటికి మరమ్మత్తులు చేసి, కాలం చెల్లిన వాటి స్థానే కొత్త వాటిని కొనిపించి వినియోగ దారులు నష్టపోకుండా చేయడం ఈ శాఖ విధి. సిబ్బంది కొరత వల్ల ఈ పని చేయలేని ఆ శాఖ కొంత మంది ప్రైవేట్ ఏజెన్సీల పై అనాదిగా ఆధార పడి పోయింది. ఈ విధానం ఏళ్ల తరబడి సాగిపోతూంది. కాటాలు రిపేరు చేయడంలో అనుభవమున్న వారు నామమాత్రమైన 100 రూపాయల లైసెన్స్ ఫీజు కట్టి ఏజెన్సీకి దరఖాస్తు పెట్టుకోవాలి. రిపేర్లు చేయడానికి అవసరమైన పరికరాలు సమకూర్చుకోవడం, వ్యాపారస్తులు పరికరాలను పరీక్షించను ఏజెన్సీలకు ఇచ్చినప్పుడు ప్రత్యామ్నాయంగా పరికరాలు ఇవ్వడం ఈ వెయింగ్ సర్వీసుల వారి బాధ్యత అయినా ఆ పని చేయడం ఎక్కడా జరగడమే లేదు. నెల్లూరు డివిజన్ పరిధిలో వున్న 4 వేల షాపుల్లో 800 షాపులు టౌన్‌లో వున్నాయి. తూనికలు కొలతల పరికరాలు పరిశీలించి వేసే ఛార్జి కేవలం లక్ష రూపాయలు మాత్రమే ప్రభుత్వ ఖాతాలో జమ అవుతుంటే వెయింగ్ సర్వీసుల వారు మాత్రం 6 లక్షల రూపాయల పైనే ఆర్జిస్తున్నారు. అధికార్లకు ఇచ్చే మామూళ్లు, రవాణా ఛార్జీలంటూ వసూలు చేసే 4 లక్షలనూ కలుపుకొంటే వెయింగ్ సర్వీసుల వారు 10 లక్షల నికరాదాయం అక్రమంగా పొందుతున్నారు. తమ లోపాలు బయట పడతాయనే భయంతో వ్యాపారులెవరూ ఈ అక్రమార్జనను ప్రశ్నించక పోవడంతో వీరి ఆర్జనకు అడ్డు నిలిచే వారే లేకుండా పోయారు. అడిగిన వారిని ఏదో నెపంతో ఏడిపిస్తారు.

వెయింగ్ ఏజెన్సీల సిబ్బంది తామే అధికార్ల మాదిరి హడావుడి సృష్టించి వ్యాపారస్తులను భయపెట్టి ప్రతి సంవత్సరం వారి నుండి వస్తువులను సేకరిస్తారు. పదికిలోల బరువు తూచే కాటాకి ముద్ర వేయను 16 రూపాయలు తీసుకొంటుంటే ప్రభుత్వానికి కేవలం 4 రూపాయలే పోతుంది. 10 కేజీల బరువు తూచే కాటాకు వెయింగ్ సర్వీసు వాళ్లు 40 రూపాయలు వసూలు చేస్తుంటే ప్రభుత్వానికి దక్కేది 10 రూపాయలే. ఇంత వసూలు చేసి ఏమైనా సర్వీసు చేస్తున్నారా అంటే అదీ లేదు. కనీసం కాటాలకు రంగు కూడా పూయరు. సరిగా వున్నవో లేవో చూడరు. రాళ్ల పై ముద్రలు వేసి వుండే సీసాన్ని కూడా కరిగించక పాత వాటి పై ముద్రలు వేసి పంపేస్తారు. ప్రతి సంవత్సరం లక్షలాది రూపాయలు ఆర్జిస్తున్న వెయింగ్ సర్వీసుల వాళ్లు ప్రభుత్వానికి లైసెన్స్ రిన్యూవల్ ఫీజు క్రింద చెల్లించేది 100 రూపాయలంటే ఆశ్చర్య పోవడం మన వంతవుతుంది. గూడూరు డివిజన్ నుండి 60 వేలు, కావలి నుండి 50 వేల రూపాయల మొత్తం పరిశీలన వస్తుల ఆదాయంగా ప్రభుత్వ ఖాతాలో జమ అయితే ఆ మొత్తానికి పదింతలు సర్వీసుల వారి సొంతమవుతున్నది. జిల్లాలో ఏళ్ల తరబడి సర్వీసులలో గుత్తాధిపత్యం కొనసాగుతూనే వుంది. నెల్లూరు టౌన్‌లో వివిధ బినామి పేర్లతో ఒకే వ్యక్తి ఈ వెయింగ్ సర్వీసులు నడుపుతున్నాడు. గూడూరు డివిజన్ కూడా ఈ వ్యక్తి హస్తగతంలోనే వుందట. వెయింగ్ సర్వీసుల వారు ఎక్కువ మొత్తం వసూలు చేయకూడదని చెప్పే అధికారం తమకు లేదని ప్రభుత్వమే ఈ విధానాన్ని మార్చాలని నెల్లూరు లీగల్ మెట్రోలజి ఇన్స్పెక్టర్ మోహన రామయ్య చెప్పారు. అధికారులమై వుండి వారి పై ఎటువంటి చర్యా తీసుకోలేనంత బలహీన స్థాయిలో తాము ఒక వేళ అధికారం వుండినా తమకు నెల జీతానికి పదింతలు లాభం తెచ్చే వారి పై వారెందుకు చర్య తీసుకుంటారు చెప్పండి?



## నెల్లూరు ముచ్చట్లు

6 పేజీ తరువాయి

పెద్ద చేపనే పట్టారు. ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రెస్కో) మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ ఆర్. సుబ్రమణ్యం ఇంటిపైన, బంధువుల ఇళ్లపైన 21 తేది దాడి జరిపి, అవినీతి ఆర్జన పెద్ద మొత్తంలో పట్టుకున్నారు. ఆయన దగ్గర 13 లక్షల విలువైన అక్రమార్జన బయట పడినట్లు అనధికార వర్తమానం.

నెల్లూరులో ఏసిబి వున్నట్లు మర్చిపోయి చాలా కాలమైంది- బహుశా దీర్ఘ నిద్రలో వున్నదేమో! ఇప్పుడెందుకు మెలకువ వచ్చినట్లో?

### రంగడి గుడిలో ద్వార దర్శనం

తల్పగిరి రంగనాథస్వామి దేవాలయంలో ఈరోజు (24 తేది) వేకువన శ్రీ ఆనం వివేకానందరెడ్డి ఉభయకర్తృత్వంలో వైకుంఠ ద్వార దర్శనం వైభవంగా జరిగింది. తిరునాళ్లకు వచ్చినట్లే వచ్చారు భక్తులు.

రంగడి సేవలోనైనా వివేకకు పట్టిన రాజకీయ గ్రహణం విడుస్తుందేమో, చూద్దాం!

## పంచాంగము

24 తేది శుక్రవారం ముక్కోటి

### డిసెంబరు తిథులు

మార్గశిర శుద్ధ
తే25 శని ద్వాదశి రా.గ. 1.45 వ
తే26 ఆది త్రయోదశి రా.గ. 3.00 వ
తే27 సోమ చతుర్దశి రా.గ. 4.05 వ
తే28 మంగళ పూర్ణిమ రా.గ. 4.30 వ
మార్గశిర బహుళ
తే29 బుధ పాడ్యమి రా.గ. 4.30 వ
తే30 గురు విదియ రా.గ. 3.50 వ
తే31 శుక్ర తదియ రా.గ. 2.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు

## డంకెల్

(2 పేజీ కొరవ)

వెదురు, టేకు వంటి దిగుమతులను నిషేధించింది. ప్రపంచంలో అడవుల విస్తీర్ణం తగ్గి పోతున్నది కాబట్టి వాటిని నిషేధించామంటున్నది. ప్రపంచంలో ఏ భాగంలో అడవుల విస్తీర్ణం తగ్గింది. ఏ భాగం నుంచి దిగుమతులు నిషేధించింది వారు చెప్పడం లేదు. గాట్ ఒప్పందం అమలైతే ఇటువంటి ఆంక్షలు ఎన్నో వస్తాయి. రైతులు విపరీతంగా నష్టపోతారు.

గాట్ ఒప్పందం వల్ల మన దేశానికి జరుగుతున్న అతి పెద్ద ప్రమాదం - పేటెంట్ రైట్స్ నిబంధనలు. "ట్రేడ్ రిలేటెడ్ ఇంటలెక్చువల్ ప్రాపర్టీ రైట్స్" (ట్రిప్స్) అని పిలవబడే మేధాసంపత్తి హక్కుల నిబంధనలు వర్ధమాన దేశాల పీకనులిమి వేయడానికి అగ్రదేశాలు కనిపెట్టిన ఉరితాళ్లక్రిందే లెక్క; తాము కనిపెట్టిన కొత్తరకం వస్తువులను ఇతర దేశాల వారు కాపీకొట్టి, తమకంపెనీలకు పోటీగా అమ్ముతున్నారు కాబట్టి పేటెంట్ హక్కులు పరిరక్షించి తీరాలని అమెరికన్ నేతలు పట్టుబట్టి, బలవంతంగా అంగీకరింప జేశారు. ఈ నిబంధన వల్ల ముందుగా దెబ్బతినేది మందుల పరిశ్రమ. ప్రపంచ మార్కెట్‌లో భారతీయ వైద్య ఉత్పత్తులకు మంచి గిరాకీ వుంది. ఒక్కసారి పేటెంట్ నిబంధన అమలు చేస్తే కొన్ని వందల కంపెనీలు మూతపడతాయి. అమెరికాలో ఒక కంపెనీ ఒక కొత్తరకం మందు కనిపెడితే, ఇతర పై దేశాలల్లోని ఏ కంపెనీ కూడా ఆ మందును తయారు చేయడానికి లేదు. ఇతర దేశాల కంపెనీలు తమ స్వంత పరిశోధనతో మరొక రూపంలో దాన్ని కనిపెట్టినా మార్కెట్ చేయడానికి లేదు. ఈ నిబంధన ఒక్క మందులకే కాదు-విత్తనాల నుంచి కంప్యూటర్ల వరకు అన్ని ఉత్పత్తులకూ వర్తిస్తుంది. దీనివలన మార్కెట్‌లో అమెరికన్, యూరోపియన్, జపాన్ కంపెనీలు వివిధ వస్తువుల మీద గుత్తాధిపత్యం సంపాదిస్తాయి. వారు చెప్పిన ధరలకు, వారు చెప్పిన వస్తువులు ప్రపంచ ప్రజలందరూ కుక్కిన పేనుల్లాగా కొని తీరవలసిన దుర్గతి ఏర్పడుతుంది. ప్రజలు నష్టపోతారు. చిన్నతరహా పరిశ్రమలు నష్టాలకు గురౌతాయి.

గాట్ ఒప్పందం వలన ప్రభుత్వం చౌకడిపోలను నియంత్రించ వలసిన ప్రమాదం ఏర్పడుతుంది. ఉత్పత్తిదారులకిచ్చే సబ్సిడీల పట్ల తప్ప, వినియోగదారుల కిచ్చే సబ్సిడీలపై గాట్ ఒప్పందానికి ప్రమేయం వుండదన్నమాట నిజమే అయినప్పటికీ, చౌకడిపోలలో పంపిణీ అయ్యే వ్యవసాయోత్పత్తుల ధరలు ఉత్పత్తిదారుల కిచ్చే సబ్సిడీలపైనే ఆధారపడి వుంటాయన్న వాస్తవం మరచిపోకూడదు.

వస్త్ర పరిశ్రమ విషయంలోనూ గాట్ ఒప్పందం ప్రభావం విపరీతంగా వుంది. ఈ ఒప్పందం వలన వస్త్రపరిశ్రమ లాభపడుతున్నదా, నష్టపోతున్నదా అన్నది అర్థం కావడం లేదు. వస్త్రాల విషయంలో మన నాణ్యత అంతర్జాతీయ ప్రమాణాల కనుగుణంగా వుంటుంది. అందువల్ల పాశ్చాత్య దేశాలు మన దేశం నుంచి చేసుకొనే దిగుమతులపై పన్ను విధించి తమ స్వదేశీ ఉత్పత్తులకు పోటీ ఏర్పడకుండా జాగ్రత్త పడుతున్నాయి. మనమూ అదే విధానం అనుసరిస్తున్నాము. ఈ ఒప్పందం వల్ల 85 శాతంగా వున్న వస్త్రాల దిగుమతుల పన్నును 40 శాతానికి తగ్గించబోతున్నట్లు వాణిజ్య మంత్రి శ్రీ ప్రణబ్ ముఖర్జీ ప్రకటించారు. దీనివల్ల అమెరికన్ వస్త్రాలు చౌకగా లభిస్తాయి.

అయితే విచిత్రంగా అమెరికన్ వస్త్ర పరిశ్రమ వర్గాలు గాట్ ఒప్పందంలో తమకు అన్యాయం జరిగిందని, ఇండియా నుంచి ఎదురయ్యే పోటీ వలన అమెరికన్ వస్త్ర పరిశ్రమ సంక్షోభంలో పడిపోయి, ఇరవై లక్షల మంది ఉద్యోగాలు కోల్పోయే ప్రమాదం వుందని గగ్గోలు పెడుతున్నాయి. అమెరికాలోని ప్రసిద్ధ టీషర్టుల తయారీ కంపెనీ-"ఫ్రూట్ ఆఫ్‌ది లూమ్ ఇన్‌కార్పొరేటెడ్" వాషింగ్టన్ పోస్ట్ దినపత్రికలో ఒక ఫుల్‌పేజీ ప్రకటన ఇచ్చింది. గాట్ ఒప్పందంలో అమెరికన్ కార్మికులకు హాని చేసే మహా పొరపాటు దొర్లిందని, కలమేలుకొని సరిదిద్దకుంటే భారతదేశం ధాటికి మనమంతా కుప్పకూలిపోతామని" ఆ ప్రకటనలో అమెరికన్ అధ్యక్షుడు బిల్‌క్లింటన్‌ను హెచ్చరించారు. భారతదేశం 1991-92 లో అమెరికాకు 3 బిలియన్ డాలర్ల (దాదాపు 10 కోట్లు) వస్త్రాలు ఎగుమతిచేసినా, అమెరికా నుంచి ఎటువంటి దిగుమతులూ లేకపోవడం ఇక్కడ గమనార్హమన్నది వారి హెచ్చరిక. ఒప్పందం అమలైతే భారత్ దిగుమతి సుంకం 50 శాతంగా వుంటే, అమెరికా దిగుమతి సుంకం 10 శాతంగా వుంటుందని, అందువల్ల అమెరికన్ ఉత్పత్తులు భారత దేశంలో పోటీకి తట్టుకోలేక వెనక్కు తగ్గ వలసి వస్తే, భారత ఉత్పత్తులు అమెరికన్ మార్కెట్‌లో రాజ్యం చలాయిస్తాయని ఆ కంపెనీ విశ్లేషించింది.

కానీ మన దేశానికి సంబంధించి చేనేత పరిశ్రమ ఈ ఒప్పందం వల్ల దెబ్బ తిని పోయే ప్రమాదం వుందని అందరూ భయపడుతున్నారు.

గాట్ ఒప్పందం వల్ల ప్రపంచ మార్కెట్‌లో ఎగుమతులు 275 మిలియన్ డాలర్ల మేరకు పెరుగుతుందని అంచనా కట్టారు; దానిలో భారత్ వాటా ఒక బిలియన్ డాలర్ వుంటుందని కూడా వారే చెప్తున్నారు. మూడు వేల కోట్ల ఎగుమతుల కోసం దేశ ఆర్థిక వ్యవస్థ స్వాతంత్ర్యాన్ని తాకట్టు పెట్ట వలసిన అవసరం వుందా అన్నది ప్రశ్న. ఆ మాత్రం అభివృద్ధి ఏ ఒప్పందం అవసరం లేకుండా సాధించలేమా?

డంకెల్ ఒప్పందం పై ప్రభుత్వం సరైన వివరణలు ఇస్తే తప్ప ఈ విషయంలో ప్రజలలో నెలకొని వున్న సందేహాలు నివృత్తి కావు.

## మండల ప్రజా పరిషత్ కార్యాలయము

టెండరు నోటీసు నెం. 2/93 తోటపల్లిగూడూరు. 23.12.93 తేది

### టెండరు నోటీసు

ఇందు వెంట జత పరచబడిన అనుబంధములోని పనులను నిర్వహించుటకు పంచాయితీ రాజ్ రిజిష్టరు కాంట్రాక్టర్ల నుండి సీలు వేసిన టెండర్లను మండల అభివృద్ధి అధికారి, తోటపల్లి గూడూరు వారు తమ ఆఫీసులో 31.12.93 తేది సాయంకాలం 3.30 గంటల వరకు స్వీకరించి అదే రోజున సాయంకాలం 4.00 గంటలకు టెండరు దారులు లేదా వారి ఏజెంట్ల సమక్షములో మండల అభివృద్ధి అధికారి గాని లేక వారు నియమించిన అధికారి గారు గాని తెరచెదరు.

2. టెండరు షెడ్యూలు కొరకు వచ్చు దరఖాస్తులు 30.12.93 తేది వరకు కార్యాలయపు పని వేళలలో మండల అభివృద్ధి అధికారి, తోటపల్లి గూడూరు వారు సేకరించెదరు. సదరు దరఖాస్తు వెంట టెండరు షెడ్యూలు ధర మరియు సేల్స్ టాక్స్ చెల్లించిన చలానాలు జతపరచ వలయును. టెండరు షెడ్యూలు ధర మరియు సేల్స్ టాక్సు మొత్తమును మండల సాధారణ నిధులకు, ఉప పద్దులకు చెల్లించ వలయును. మరియు రిజిష్ట్రేషన్ ఉత్తర్వులు నకలు దరఖాస్తుకు జత పరచవలయును.

3. టెండరు షెడ్యూలు కొరకు అర్థించే టెండరు దారులకు 24.12.93 తేది నుండి యివ్వబడును. టెండరు షెడ్యూలు కొరకు చెల్లించిన సొమ్ము ఎటువంటి పరిస్థితిలోను తిరిగి ఇవ్వబడదు.

4. టెండరు ఆహ్వానించిన తేది అసాధారణ శెలవు రోజు అయిన మరుసటి కార్యాలయపు పని దినము నందు స్వీకరించ బడును.

5. టెండరు దారులు తమ టెండర్లను రెండు సీల్డు కవరులో వేయవలయును. టెండరు షెడ్యూలు తదితరములు ఒక సీల్డు కవరులో, ధరావత్తు సొమ్ము జత చేసిన చలానాలు మరియొక సీల్డు కవరులో పెట్టి వేయవలయును. లేని పక్షమున వారి టెండరును వెంటనే తిరస్కరించ బడును.

6. మండల అభివృద్ధి అధికారి, తోటపల్లి గూడూరు వారికి ఎటువంటి కారణము లేక పోయినప్పటికి ఏదేని లేదా మొత్తము టెండర్లను తిరస్కరించు అధికారము కలదు. టెండరు దారులు తమ టెండరుతో పాటు ఈ మధ్య కాలములో చెల్లించిన ఇన్‌కంటాక్సు లేదా సేల్సు టాక్సు క్లియరెన్స్ ధృవపత్రమును జతపరచవలెయును.

7. ధరావత్తు సొమ్ము చెల్లింప కుండ వేసిన టెండర్లు వెంటనే తిరస్కరించబడును.

అనుబంధము

| | |
|---|---|
| టెండరు తేది : | 31.12.93 |
| టెండరు షెడ్యూలు జారీ చేయు తేది : | 24.12.93 |
| టెండరు షెడ్యూలు దరఖాస్తులకు ఆఖరు తేది : | 30.12.93 |

| క్ర. సం. | పని యొక్క పేరు | అంచనా విలువ | టెండరు షెడ్యూలు ధర మరియు సేల్స్ టాక్సు | ధరావత్తు సొమ్ము | పని పూర్తి చేయవలసిన కాలము | కాంట్రాక్ట్ స్వభావం | కాంట్రాక్ట్ తరగతి |
|---|---|---|---|---|---|---|---|
| 1. | [illegible] | 65,000/- | 150/- 4/- | 975/- | 31.1.94 | ఎల్.ఎస్. | [illegible] తరగతి |

వి. శ్రీనివాసులు నాయుడు
మండల అభివృద్ధి అధికారి,
తోటపల్లిగూడూరు

## శివారెడ్డి పద్యాలు

### పెళ్లకూరు

పెళ్లకూరు మా యిష్టదైవమ్ము
కర్తిలేని పచ్చి కాంగ్రెసోడు
నీతి నిష్టపరుడు నెల్లూర్లో యీ మధ్య
కలుసుకున్న కొద్ది కలరు మార్చు!

### రమణారెడ్డి మొగళ్లూరు

దేవదేవుడన్న దేవాలయాలన్న
పేదసాదలన్న ప్రీతిమెండు
కవిని నేను నీకు కాకుండ బొయ్యా!
రమణారెడ్డి! ఏదో వ్రాత తప్పు!

మొగళ్లూరు నీచే ముందు కొచ్చేసింది
పలురకాల పైకి ప్రాకుతుంది
అంత మాత్రమెవరు ఈ గడ్డు రోజుల్లో
నిజము బయట పెడితె నిష్ఠురమ్ము?

### కాయగూర్లు

కాయగూర్లు దింటె కడుపుబ్బరిస్తుంది
అసలె పనికి రావు ఆకూర్లు
ఫిష్షుఎగ్గు మటను పిత్రార్జితము మెంత
దిన్న ఏమి జేయదు తీరదాక!

### ఆమలూరు కమలమ్మ

(ఐనముడుగు)

అరిగెపరమ పదము అమ్లూరు కమల్మ
కవిని వస్తు బోత కంట్లో బడితె
అన్ని యిన్ని గావు తిన్నన్ని యిడ్లీలు
తుక్కు కాఫి లెక్క గాదు

## జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

సంఘాలు గొడవ చేయనారంభించాయి. కుంభకోణంలో లక్షా పదమూడువేల రూపాయల మేర గల్లంతయ్యింది ఎ విభాగపు హాస్టలులో అవినీతి జరిగితే బి విభాగపు హాస్టలు క్లర్కును సస్పెండ్ చేయడంలో తిరకాసుందని మరికొందరి వాదన. ఈ గుట్టు రట్టు చేయను మాజీ ఐ.ఎ.ఎస్. అధికారి శ్రీ ఎస్.ఆర్. శంకరన్, రిటైర్డు ప్రిన్సిపాలు ఎం. పట్టాభిరామి రెడ్డి, మాజీ ఎం.ఎల్.సి. మాధవరావులతో కమిటీని వేసారు. కాని ఈ కమిటీ హాస్టలు రికార్డులు బయటకు తీసుక పోవడానికి విద్యార్థులే అడ్డు తగిలారు.

ఎవరికి వారే యమునా తీరేలా ఒక్కొక్క విద్యార్థి సంఘం ఒక్కొక్క డిమాండ్ చేస్తుంది. వీరిలోనూ చిత్తశుద్ధి లోపిస్తుంది. తామే నిర్వహిస్తున్న హాస్టళ్లలో కొనుగోలు, చెల్లింపులు విద్యార్థి ప్రతినిధులకు తెలియకుండా జరిగాయా; జమాఖర్చులు రాసే గుమాస్తాలు నిర్ణయాల స్థాయికి ఎందుకు ఎదిగారన్నది బట్టబయలు కావలసివుంది. ఏళ్ల తరబడి హాస్టళ్లలో పడి పరాన్న జీవులుగా బ్రతుకుతున్న వివిధ పార్టీల హోల్‌టైమర్లు; సీనియర్ విద్యార్థుల తిండికి వార్డెన్లు ఏనాడు అడ్డుతగలక సర్దుబాటు ధోరణిలో తాము కూడా కొంతమేర సర్దుకొన్నట్లు తెలుస్తుంది. ఏదైతేనేం మొత్తానికి విద్యార్థి సంఘాల మధ్య ఘర్షణల మూలంగానే ఈ కుంభకోణం బట్టబయలైంది. ప్రస్తుతం విషయం జిల్లా కలెక్టర్ ముందుంది. ఆయన మరో కమిటీని వేసి కాలయాపన చేయక ఒకరోజు కావలి వచ్చి స్వయంగా ఈ విషయాలన్నింటిని సమగ్రంగా పరిశీలించి ఏదో ఒకటి చేస్తేగాని పోయిన జెబి కళాశాల పరువు తిరిగి రాదు.

### ఆర్టీసి బస్సుల రద్దుతో ప్రయాణీకుల పాట్లు

రాపూరు ఆర్టీసి డిపో వారు తమ ఇష్టానుసారం బస్సులను రద్దుచేస్తుండడంతో ప్రయాణీకులు పడరాని పాట్లు పడుతున్నారు. ఇక్కడి డిపోనుండి విజయవాడకు ఎక్స్‌ప్రెస్ సర్వీసులు తెల్లవారుజామున 5 గంటలకు, మధ్యాహ్నం రెండు గంటలకు పోతుండేవి. కాని అర్థాంతరం ఈ బస్సులను ఆపివేశారు. అదె విధంగా తిరుపతికి ప్రతిదినం వెళ్లే బస్సులను ఒకరోజు త్రిప్పితే మరో మూడు రోజులు తిప్పక డిపోలో మూలన పెడుతున్నారు. రాపూరు నుండి కోడూరు మీదుగా నెల్లూరు పోయే బస్సు, రాపూరు నుండి నెల్లూరు నడిచే పాస్ట్ సర్వీసులను తరచూ ఆపి వేస్తున్నారు. ఏరోజు ఏ బస్సును రద్దు చేస్తారో తెలియని ప్రయాణీకులు బస్టాండ్ వరకు రావడం వుసురుమని వెనుకకు తిరిగి పోవడం ప్రతినిత్యం కన్పిస్తుంది. బస్సుల రద్దు వివరణలు ఇచ్చే నాథుడే లేని ఇష్టా రాజ్యమైపోయింది రాపూరు డిపో.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సర చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

సినిమా సినిమా సినిమా సినిమా

# ప్రియకు రాధిక లెంపకాయ!

రజనీకాంత్ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి సమర్పించిన "వళ్ళి" తమిళ చిత్రంలో అతని సరసన ముఖంకాస్త చూపి కనిపించిన ప్రియారామన్ అప్పుడే తానుగొప్ప తారనయ్యానని విర్రవీగుతున్నట్లు నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటున్నారు. ఈమె ఐ.వి. శశి దర్శకత్వంలో ఓ మలయాళ చిత్రంలో నటిస్తోంది. ఒక సన్నివేశంలో హీరోకు కాస్త దగ్గరగా ఉండి, అతడ్ని అక్కున చేర్చుకోవాలని డైరెక్టర్ చెప్పారు. తాను అలా చేయనని ప్రియ అనేసి ఊరుకుంటే బాగుండేది. "అదే- ఆ రాధిక లాంటి వారే, మీరు చెప్పినట్లు చేయగలరుగాని, నాకేం ఖర్మ పట్టింది?" అనడం రాధిక చెవుల్లో పడింది. అంతే, రాధిక ఆగ్రహావేశంతో "ఏంటే కూశావ్?" అంటూ చివాలున వచ్చి ప్రియ చెంపచెళ్ళుమనిపించింది. షూటింగ్ స్పాట్‌లోని వారంతా అవాక్కయి పోయారు. ప్రియారామన్‌కు చక్కగా బుద్ధి చెప్పిందని రాధికను మెచ్చుకున్నారు ఆతర్వాత!


రైల్వే కూలీ చిత్రంలో హరీష్, మమ్ముట్టి, రోజా, మీనా

# సంక్రాంతికి చాలా చిత్రాలు

పండుగలలో "ముఖ్యంగా సంక్రాంతి సమయాన కొత్త చిత్రాలు విడుదల చేస్తే రాబడి బాగా ఉంటుందని చాలాకాలంగా నిర్మాతల నమ్మిక. ఐతే, ఒక్కసారిగా ఎన్నో చిత్రాలు విడుదలవడంతో ఏ సినిమాకు వెళ్లాలో తోచక తికమకలు పడిపోతుంటారు ప్రేక్షకులు. ఈ సంక్రాంతికి నాగార్జున, శ్రీదేవి నటించిన వైజయంతి మూవీస్ చిత్రం "గోవింద.. గోవిందా" సుమన్ రోజాల "సమరం"; డాక్టర్ రాజశేఖర్ ప్రధానపాత్ర నిర్వహించిన "అంగరక్షకుడు", చిరంజీవి త్రిపాత్రలు ధరించిన "ముగ్గురు మొనగాళ్ళు" తోపాటు కృష్ణ నటించిన నెంబర్ వన్ చిత్రాలు విడుదలవు తున్నాయి.

# అందరి దృష్టి హిందీ పైనే!

ఇదివరకు తమిళం, కన్నడం, మలయాళం చిత్రాలను రీమేక్ చేయడానికి పోటీలు పడ్డ నిర్మాతల దృష్టి ఇటీవల హిందీ చిత్రాల మీద పడింది. "దామిని,ఖల్‌నాయక్, సర్" చిత్రాలు తెలుగులో తయారవుతున్న విషయం పాఠకులకు తెలిసిందే. కొత్తగా "హమ్‌హై ప్యారేకే" చిత్రాన్ని బుర్లి సుబ్బారావు కొన్నారు. ఇందులో సుమన్, మాలాశ్రీ, నాగేష్, గిరిబాబు, కోటశ్రీనివాసరావు, బ్రహ్మానందం, బాబూమోహన్, బిబి సునయ, ఎ.వి.ఎస్, మాస్టర్ రాజశేఖర్ పాత్రధారులు. దర్శకత్వం: కె. సదాశివరావు.

## మళ్ళీ పతాక సన్నివేశాలు షూటింగ్

చిత్రం ఆశించినంత విజయం సాధించనప్పుడు కొత్తగా ఓ పాటను చేర్చడమో, పతాక సన్నివేశాలను రీషూట్ చేయడమో కొందరు నిర్మాతలకు రివాజు. ఇది నిర్మాత డి. రామానాయుడికి కూడా తప్పలేదు. "అక్కా చెల్లెళ్ళు" పతాక సన్నివేశాలను ఆయన మళ్ళీ చిత్రీకరించడానికి పూనుకున్నారు.

## అర్జున్ దర్శకత్వంలో చిత్రం

"జెంటిల్‌మెన్" చిత్రంతో అర్జున్ ప్రభంజనం వీచినట్లే "ఖల్‌నాయక్" హిందీ చిత్రాన్ని నిర్మాత కె.వి.వి. సత్యనారాయణ కొడుకు కె. జితేంద్ర తెలుగు, తమిళ భాషల్లో పునర్నిర్మి స్తున్నాడు రెండు వెర్షన్‌లకూ హీరో అర్జున్ దర్శకుడు.

## త్రిమూర్తులు

కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, బాబూమోహన్‌లు ఉంటేచాలు - ఆ చిత్రాలు అమ్ముడు

కొరవ 11 పేజీలో

# పాత చింతకాయ పచ్చడి తిన్నట్లుంది
# రౌడీ రాజకీయం

రౌడీయిజం రాజకీయాల్లోకి జొరబడి చాలా కాలమైంది. జొరబడింది అనటం కంటే రాజకీయాలే స్వార్థదృష్టితో నొసట కుంకుమ దిద్ది రౌడీయిజాన్ని ఆహ్వానించాయని చెప్పటం సమంజసంగా వుంటుందేమో! ఎలాగైతేనేమి రౌడీయిజం రాజకీయాల్లో బాగా తిష్టవేసింది.

ఈ రౌడీయిజాన్ని రాజకీయాలు సమృద్ధిగా ఉపయోగించుకుంటున్న తరుణంలో, దాన్ని సద్వినియోగం చేసుకునేందుకు సినిమా నిర్మాతలు, దర్శకులు కూడా నడుంబిగించారు. రాజకీయాల్లో వీరవిహారం చేస్తున్న రౌడీయిజం కథాంశంగా ఇదివరకే చాలా సినిమాలొచ్చాయి. రౌడీ రాజకీయం నిత్యకృత్యంగా జరిపే హత్యలు, మానభంగాలు, దోపిడీలు, దహనాలు వగైరా వగైరా అమానుష చర్యలు అన్నీ ఆనేస్తు సినిమాల్లో చూపి జనసామాన్యాన్ని ఆకట్టుకొని ఆర్థికంగా కొందరు నిర్మాతలు లాభపడ్డారు. విచ్చల విడిగా సాగుతున్న రౌడీయిజం మూలంగా ప్రజలు భయంకర జీవితం గడుపుతున్నా, రాజకీయాలు, సినిమాలు మాత్రం బాగుపడుతున్నాయి.

ఈ విధంగా ఆర్థికంగా లాభపడాలన్న ఉద్దేశంతో తిరుపతి "రౌడీ రాజకీయం" చిత్రం నిర్మించారు. రౌడీయిజం పెరిగి పోతున్న ఈ రోజుల్లో ఇలాంటి చిత్రాలు అవసరమే. కాని చెప్పిందే చెప్పటం, ఇది వరకటి చిత్రాల్లో చూపిందే చూపటంవల్ల వాటిని ఒకసారి గుర్తు చేసుకోవటమే అవుతుంది కాని కొత్తగా చూసినట్లు

**గ్రిద్దలూరు గోపాలరావు**

నిపించదు. కాస్త విసుగు పుట్టిస్తుంది.

ఈ సినిమాలో రాజకీయ నాయకుడు శరాబంద్ (కాస్ట్యూమ్ కృష్ణ) సేనాపతి, శక్తి అనే ఇద్దరన్నదమ్ములు బడా రౌడీలు. ఈ ముగ్గురూ రౌడీ రాజకీయం సాగిస్తారు. సామాన్యంగా రాజకీయ నాయకుల కుమారులు తండ్రిని మించిన దుండగులుగా తయారవు తుంటారు. ఇందులో ఈ రాజకీయ నాయకుని కూతురు శశిరేఖ (ఆమని) తండ్రిని మించిన తనయగా పేరు కెక్కుతుంది.

శరాబంద్ తనకు తొత్తుగా వ్యవహరించే సబ్‌ఇనస్పెక్టర్ను అడ్డం పెట్టుకొని తన స్వార్థచింతన సాగిస్తుంటాడు. నిరుద్యోగిగా వున్న శివాజీ (భానుచందర్) శరాబంద్ దుర్మార్గాలను ఎదిరిస్తాడు. అతని అడ్డు తొలగించుకునేందుకు అతనికి పిచ్చిపట్టిందని పదిమందిని నమ్మించి పిచ్చాసు పత్రి పాలుజేస్తాడు శరాబంద్. ఆ ఊరికొచ్చిన కరుకైన ఏయస్పి శాంభవి (జయసుధ) శరాబంద్‌కు శత్రువుగా తయారు కావటంతో ఆమెమీద తప్పుడు కేసు బనాయించి ఉద్యోగం పోయేట్టు చేస్తాడు. ఇట్లాగా నిపని అని శాంభవి, పిచ్చాసుపత్రి నుంచి తిరిగొచ్చిన శివాజీతో కలిసి రౌడీల మీద శరాబంద్ మీద పగతీర్చు కుంటుంది. ఈ పగసాధించటం మామూలుగా సినిమా చివరన జరిగే ఫైటింగులతోనే జరుగుతుంది.

రౌడీయిజంలోని క్రూరత్వాన్ని, రాజకీయంలోని పొగరుబోతు తనాన్ని, హీరోయిన్ శశిరేఖలోని శృంగారాన్ని అతిగా చూపటంతో ఆ సంఘటనల బలం పెరుగుతుందని భ్రమించారు

కొరవ 11 పేజీలో

## శ్రద్ధాంజలి

### శ్రీ మావిళ్ల రామానుజులు



రిటైర్డ్ టీచర్, అన్నారెడ్డిపాలెం. 12.12.93 ఆదివారం స్వర్గస్థులైనారు. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

కుమారులు: మావిళ్ల సుబ్రహ్మణ్యం, సూర్య ప్రకాశ రావు కృష్ణమూర్తి కోడళ్లు: పద్మావతి, సుభాషిణి, ఈశ్వరి, అల్లుడు: బెతు దశరథరామయ్య, కూతురు: సులోచన మనమళ్లు, మనుమరాండ్రు: హర్షకుమార్, సుధీర్.

## సణుగుడు

(4 పేజీ కొరవ)

బాబా భక్తులేగాదు, మాకు సన్నిహితులైన మిత్రులూ, పాఠకులూ చాలా మంది ఈ వార్తపై ప్రతిస్పందించారు. కొందరు అభినందిస్తే, కొందరు వివరాలిందుకు, పూరకొంటే పోలేదా అని స్నేహపూర్వకంగా మందలించారు. ఇంత మంది చెప్పిన తర్వాత నేను చేసింది తప్పేమోనన్న శంకతో ఆ వీడియో ఫిలింను మళ్ళీ చూశాను. గతవారపు నా వ్యాఖ్యల్లో అణువంత తప్పిదం లేదన్న నమ్మకం కల్గింది. నేను తప్పేమీ చెప్పలేదన్న విశ్వాసం కల్గింది. బాబాగారు మెమెంటో చెక్కక్రింద అతికించి వుంచిన బంగారు రంతను అలాగ్గా చేతితో లాగి, గుప్పెటలో దాచి, గాలిలో నుంచి సృష్టించినట్లుగా భ్రమింపజేయడం కళ్లకు కట్టినట్లు కన్పడుతున్నది.

బాబామీద నాకు వ్యక్తిగత ద్వేషమేమీలేదు. నేనెప్పుడూ ఆయన్ను చూడలేదు; చూడాలని అనుకోవడం లేదు. నేను దేవుణ్ని నమ్మని నాస్తికుణ్ని కాను; ఏ తీవ్రవాద లేదా హేతువాద సంస్థతోనూ నాకు సంబంధం లేదు. కానీ తన నిజస్వరూపం ఎక్కడ బయట పడుతుందోనన్న భయంతో, తన అంతరంగిక రహస్యాలు, లోగుట్లు వెలికివస్తాయన్న వేదనతో, తన భక్తులే అయిన, తన సేవలోనే వుండిన, తనకు సన్నిహితులైన నలుగురిని నిర్దాక్షిణ్యంగా గదిలో పెట్టి కాల్పించి చంపించిన ఒక కసాయి వ్యక్తిని దేముడని కీర్తించడం, బాబా అని మొక్కడం నాకు ఏవగింపు కల్గిస్తున్నది. పుట్టపర్తిలో జరిగిన హత్యలు బాబా ప్రమేయం లేకుండా జరిగాయన్నది పచ్చి అబద్ధం. ప్రధాన మంత్రి నుంచి పోలీసు కానిస్టేబిల్ వరకు తన కాళ్లదగ్గర పడివున్నారు కాబట్టి ఆయన ఆ హత్యలను మాఫీ చేయించగల్గుతున్నారు కాని, ఆర్మిక దృక్పథంతో ఆలోచించే వారెవరికైనా ఈ హత్యలెట్లా జరిగాయో, ఎందుకు జరిగాయో చెప్పకుండానే అర్థమైపోతుంది. ఆయన ప్రేమ స్వరూపుడైతే, ఆయనలో తోటి మానవుని పట్ల నిజమైన ప్రేమవుంటే, అహింసను బోధించేవాడే అయితే, భగవత్ స్వరూపత్వానికి అర్థం తెలిసిన వాడే అయితే ఆనాడు జరిగిన దారుణానికి విచలితుడై వుండాలి; చిత్తక్షోభననుభవించి వుండాలి; తన సన్నిధిలో తన ఇంటి పడక గదిలో రక్తం పారినందుకు మనసులో కుమిలిపోయి వుండాలి; సమాజానికి ముఖం చూపించడానికి సిగ్గుపడి వుండాలి. భగవత్స్వరూపత్వం ఒక వ్యాపార ప్రక్రియగా భావించేవారు కాబట్టి భక్తి బిజినెస్‌కు దెబ్బ తగలకుండా చూసుకొనే మార్గాన్వేషణ తప్ప ఆయనలో ఎటువంటి ప్రేమార్ద్ర భావాలూ కన్పించలేదు. ఈ వారం ఆంధ్రజ్యోతి దినపత్రికలో బాబాగారి పలుకులు చూడండి-

ఆనాటి సంఘటనను ప్రస్తావిస్తూ, తనకు సానుభూతి చెప్పడానికి వచ్చిన వారితో బాబా అట్లా అన్నారట-"మీరంతా ఇలా ఎందుకు బాధపడుతున్నారో నాకు అర్థం కావడం లేదు; అప్పుడేమి జరిగింది. ఆరోనెలలో ఆరోతారీఖున ఆరోరూములో, అరిషడ్వర్గాలైన అరువిషయాలు నశించాయి, అంతే కదా"!

ఈ మాటలు వింటే ఏమన్పిస్తున్నది; కడుపు భగభగ రగిలి పోవడం లేదా? భక్తి, వేదాంతాలు ప్రబోధించే స్వామీజీగా కాదు, సాధారణ వ్యక్తిగా అయినా సరే హత్యకు గురైన వ్యక్తుల పట్ల ఇంత హేయంగా మాట్లాడవచ్చా? అట్లా మాట్లాడే వాడిని స్వామీజీగా గౌరవించడమెట్లా? అందుకు మనస్సెట్లా వప్పుతుంది? మన రాజకీయ నాయకులు సిగ్గు, వెరపు అన్నదే లేని నీచ మనస్తత్వం కల్గిన వారు కాబట్టి హత్యలు చేసిన లేదా చేయించినా లేదా చేయించాడన్న సందేహం కల్గిన సత్యసాయిని పోలీసు కేసు నుంచి రక్షించడానికి సాక్షాత్తు కేంద్ర హోం మంత్రి వర్యులు పరుగు పరుగున పుట్టపర్తి వచ్చి కాపాడారు. కాని మరొకరు ఈ దుర్ఘటనకు కారకులైతే తేలికగా వదలి పెడతారా? భక్తికోసం సత్యసాయి వంటి వారిని, డబ్బు కోసం హర్షద్ మెహతా వంటి వారిని నిస్సిగ్గుగా పరిరక్షించే పెద్ద మనుషులు మన దేశంలో వున్నారు కాబట్టి పదవుల్లో కూర్చుని ప్రజల నెత్తిన స్వారీ చేస్తున్నారు; ఇంకొక దగ్గరైతే కటకటాలు లెక్క పెడుతూ వుండి వుండేవారు.

* * *

సత్యసాయి బాబా నిజ రూపాన్ని వెల్లడి చేసిన వీడియో ఫిలింను ఒక నెల్లూరు డాక్టరు నాకు పంపించాడని గత వారం వ్రాశాను; అది పొరపాటు. అది మరొక మిత్రుడి ద్వారా నాకు చేరింది; ఆ డాక్టర్‌కు సంబంధం లేదు. జరిగిన పొరపాటుకు క్షంతవ్యుణ్ని.



## పి.సి. రెడ్డి

(4 పేజీ కొరవ)

పిసిరెడ్డి రాజకీయాల్లోనే వుండి వుంటే ముఖ్యమంత్రి అయ్యేవారని, లాయర్‌గా కొనసాగివుంటే జడ్జి అయివుండే వారని, ప్రజాసేవలో కొనసాగి చరితార్థుడయినట్లు చెప్పారు.

అభినందనలతో పుల్కి తబ్బిబ్బైన శ్రీ పి.సి. రెడ్డి కృతజ్ఞతలు తెలియజేస్తూ తన అభివృద్ధికి కారకులైన శ్రీ పొట్టి శ్రీరాములు, 'జమీన్‌రైతు' స్థాపకులు శ్రీ నెల్లూరు వెంకట్రామ నాయుడు, శ్రీ దువ్వూరి రామిరెడ్డి, తన అజ్ఞాత గురువు పుచ్చల పల్లి సుందరయ్యలను గుర్తు తెచ్చుకొన్నారు. తనకు చేసిన సన్మానం కార్మిక కర్షకులకే చెందుతుందన్నారు. శ్రీ రెడ్డిని సన్మానం చేయను వచ్చిన వారిలో పలువురు ఆయన పాదాలకు నమస్కరించడాన్ని వప్పుకోలేదు. సినీనటుడు చిరంజీవి తండ్రి శ్రీ వెంకట్రావ్ ఆపని చేయను పోతే వద్దని వారించారు. జమీన్‌రైతు శివారెడ్డి తన ధోరణిలో పద్యకుసుమాల అక్షింతలు చల్లినంత సేపు శ్రీ రెడ్డి లేచి నిలబడి గౌరవం చూపారు. సన్మాన పత్రాన్ని శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు చదివారు. సినీనటుడు చిరంజీవి, శ్రీ మల్లిమాల సుందరరామిరెడ్డి శ్రీ పి.సి. రెడ్డిని అభినందిస్తూ సందేశాలు పంపారు. అయ్యప్ప దీక్షలో వున్న నెల్లూరు ఎమ్మెల్యే జి.వి. రెడ్డి సభముగిశాక వచ్చారు. కార్యక్రమం విజయవంత మవడంలో ఐ.వి.ఎస్. నాయుడు, పట్నం జగన్నాధం, డాక్టర్ హరిప్రసాద్ బాగా శ్రమించారని చెప్పవచ్చు.

## గ్రంథసమీక్ష

(4 పేజీ కొరవ)

"కవిత్వం ప్రకృతి రహస్యాల్ని గుర్తించి భావనాత్మకంగా, వ్యూహాత్మకంగా వాటిని పరిష్కరించడానికి ప్రయత్నిస్తుంది. తత్త్వశాస్త్రం హేతువుకు సంబంధించిన రహస్యాల్ని గుర్తించి ప్రపంచం ద్వారా వాటిని పరిష్కరించడానికి ప్రయత్నిస్తుంది" అని కవిత్వ, తత్వశాస్త్రాల లక్ష్యాన్ని వ్యక్తం చేశాడు.

కళకూ, ప్రకృతికీ వున్న సామ్యాన్ని, తేడాను వివరిస్తూ, కళ ప్రకృతిలాంటిదే. అగాధ రహస్యాలతో నిండిందే. అయితే ప్రకృతి కన్నా బాగా అర్థమయ్యేది, అర్థం చేసుకోగలిగేది! కళ ప్రకృతితో పోటీకి దిగదు. ప్రకృతి విశాలత్వాన్ని, లోతును, అందుకోవాలని ఆరాట పడదు. వివిధాంశాల సంబంధాల సామర్స్యాన్ని, శిల రాయమాన సౌందర్యాన్ని, గంభీరమైన భావగర్భితాన్ని, హృదయపు లోతుల సారమ్యాన్ని కళ గ్రహించ గలుగుతుంది. అందివ్వ గలుగుతుంది.' అంటాడు గొథే.

జీవితం గొప్పదా ! కళ గొప్పదా ! అన్న ప్రశ్నకు "నేను జీవితాన్ని కళకన్నా ఎపుడూ గొప్పదిగానే భావిస్తాను, జీవన శరీరానికి వున్న అలంకారఛాయని, పై మెరుగును మాత్రమే కళ వ్యక్తీకరిస్తుందని గొథే అంటాడు.

యువ కవుల ఆత్మాశ్రయ ధోరణిని గురించి 'మన యువ కవుల్లో చాలామంది ప్రతిభావంతులే! వాళ్ల ఆత్మాశ్రయ ధోరణి అంత ముఖ్యమైంది కాదు. బాహ్యమైన, సామాజికమైన రంగంలో వాళ్లకి వస్తువే కనిపించదు. కనిపించినా వాళ్ల స్వీయ ధోరణికి ఉపలబ్ధమైందే స్వీకరిస్తారు. కాని బాహ్య పరిసరాలనుంచి ముడిసరుకును స్వీకరించేటప్పుడు దాని ఆవశ్యకతనుబట్టి, అది అయిష్టమైందైనా మనం గ్రహించినప్పుడే కళాకారుని ధర్మం నిర్వహించినట్లవుతుంది' అని అంటాడు గొథే.

దేవతల రూపురేఖల్ని చిత్రించేవాడు, వాళ్లకి ప్రాణప్రతిష్ఠ చేసేవాడు, వాళ్లచేత ఆకాశయానం చేయించేవాడు, వాళ్లని మనకు సన్నిహితంగా భూలోకానికి రప్పించేవాడే కవియని గొథే కవిని గూర్చి నిర్వచించాడు.

'కొటేషన్లు' శీర్షికలో మనిషిని గూర్చి 'మనిషి ఆజ్ఞలు జారీచేయడానికి, అధికారం చెలాయించడానికి ఈ భూమిలో పుట్టలేదు. జీవించడానికి పుట్టాడు. ప్రభావితం చేయడానికి పుట్టాడు' అని అంటాడు గొథే.

చదువును గూర్చి విపరీతంగా చదవడంవల్ల నీరసమూ, విస్మృత్తీ, కాలం సాగిపోవడమూ మినహా మనకు ఎట్లాంటి ప్రయోజనమూ వుండదు. మనకు ఇష్టమైంది మనం మెచ్చుకొనేది చదవడమే యుక్తమైన పద్ధతి అంటాడు.

భార్యను గూర్చి చెప్తూ, భార్య ముఖంచూసే భర్త మంచివాడో కాదో తెలుసుకోవచ్చునని గొథే మానవ జీవిత సత్యాలను సూటిగా చెప్పారు.

ఇందులో కొన్ని గొథే కవితలకు అనువాదాలు కూడా వున్నాయి. ఇవన్నీ వచన కవితాలే!

'సౌభాగ్య' గారు తన మనశ్శాంతికోసం గొథే మహాకవిని అధ్యయనం చేసి వ్రాసిన వ్యాసములు, కవితలు, తెలుగువారికి కూడా గొథే మీద గౌరవాన్ని పెంచుతాయి. మానవ జీవితాన్ని, కళను, కవిత్వాన్ని, మానవత్వాన్ని పలు విధాలా తెలుసుకోదలచిన పాఠకునికీ గ్రంథం చాలా ఉపయోగకరం. సౌభాగ్య కృషి అభినందనీయం. తాను ఆరాధించే కవిని గూర్చి, వారి ఔన్నత్యాన్ని గూర్చి తెలుగువారి కోసం 'వజ్రశకలాలు' పేరుతో గ్రంథాన్ని రచించి ధన్యులైనారు. ఒక రచయిత యొక్క మనస్తత్వాన్ని వ్యక్తీకరించడంలో కృతి ఒక ఆకృతిగా నిలుస్తుంది, వివరిస్తుంది.

## జనవాణి

(3 పేజి కొరవ)

ఏది ఏమైనా సెక్సు పాఠాలు భారతీయులకు అవసరం లేదంటాను.

నెల్లూరు -వాస్తు రామచంద్ర

### అయ్యప్ప భక్తులకు తగదు

అయ్యప్ప దర్శనం కావాలంటే 40 రోజుల దీక్ష. ఆ కాలంలో పాటించ వలసిన నియమాలు చాలా వున్నాయి. అందులో అప్పు చేసి కొండకు రానక్కర్లేదు. యాచించైనా కొండకు రావచ్చునే కొందరు పెద్దలు నిబంధనలు సడలించి చెప్పారు. దీనితో యాచన చేసే భక్తులు ఎక్కువయ్యారు. ఎవరో దానం చేసే హృదయం వున్న వారి నుండి స్వీకరిస్తే బాగుంటుంది. కాని దారినపోయే ప్రతి ఒక్కరినీ చెంబులు పట్టుకొని అడగడం సబబుగా లేదు. ఇప్పటికే స్వామి నిష్ఠ దుస్తులతో దొంగ తనాలకు పాల్పడిన భక్తుల మూలంగా భక్త సమాజపు వాళ్లను శంకించే రోజులొచ్చేసి వున్నాయి. వీధిన పడిన భక్తుల మూలంగా గొడవలు రాక మునుపే పెద్దలు ఈ ధోరణి పై నియమం రూపంలో ఏదైనా చేయమని మనవి.

నెల్లూరు -అయ్యప్ప భక్తుడు

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

పద్యమాలాన్ని 18322 అని బోనుని చెప్పారు. 9,999 ను 3,333తో గుణించమంటే 3,33,26,667 చెప్పి వృద్ధులను సరిచూసుకో మన్నారు. 11 నుండి 91 వరకు అన్ని సంఖ్యలను ప్రతిదానిని ఒకమారే వుపయోగిస్తూ అర్థంగా విలువగా కూడిన మొత్తం 458 రప్పించమంటూ ప్రశ్న సంధించారు. 55, 44, 33, 22, 11, 90, 79, 68, 57అని చెప్పి శ్రీ శర్మ అబ్బుర పరిచారు. ఆల్‌జీబ్రా, ట్రిగోనామెంట్రీ వంటి కష్టసాధ్యమైన గణితంలోని చిక్కు ప్రశ్నలను మంచినీళ్ల మర్యాదలా విప్పి చెప్పారు. కళాసుధ వ్యవస్థాపకులు శ్రీ వైద్యుల శ్రీనివాసరావు, రొటేరియన్ జె.వి. రెడ్డి చేతుల మీదుగా సంజీవ రాయశర్మను పళ్ళెంలుపతో సత్కరించి వెయ్యేన్ని నూటపదహార్లుబహుకరించారు. జె.వి. రెడ్డి 500 రూపాయలు ఇవ్వగా స్వామిదాస్ విద్యార్థిని సంధ్య తన చేతికున్న బంగారు వుంగరాన్ని సంజీవరాయ శర్మకు తొడిగి తన అభిమానాన్ని చాటింది.

### గెట్ టు గెదర్‌లో డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి

సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి గారికి ఆంధ్ర విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని వర్ధమాన సమాజం 18 తేది టౌన్‌హాల్ ఓపెన్ ఎయిర్ థియేటర్‌లో గెట్‌టుగెదర్ కార్యక్రమం ఏర్పాటుచేసింది. సాయం సంధ్యవేళ ఆహ్లాద కరంగా సాగింది కార్యక్రమం. తాను చేసిన రచనల వల్ల సమాజంలో కొంత మార్పు వస్తేచాలని అంతకు మించి తానేమి కోరనని డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి అన్నారు. 21 గ్రంథాలు రాసాను ఎందులోనూ ఛందస్సులేదు; సామాన్య ప్రజలకు అర్థమయ్యే రీతిలోనే రాతసాగిందని చెప్పారు. శ్రీమరుపూరు కోదండరామిరెడ్డి దుశ్శాలువాతో శ్రీ గోపాలరెడ్డిని సన్మానించారు. కార్యక్రమంలో శ్రీ ఏ.వి. రమణారెడ్డి, గోనుకొండ వెంకటసుబ్బయ్య తదితరులు పాల్గొన్నారు. వర్ధమాన సమాజం కార్యదర్శి టి.వి. నరసింహాలు తొలుత స్వాగతం చెప్పి చివరన వందనాలు చెప్పి గెట్‌టు గెదర్‌ను ముగించారు.

### మాతమ్మల జీవితాల్లో ఇక వెలుగు!

గ్రామాల్లో జాతర, తిరునాళ్ల సమయాల్లో శక్తి దేవతల ముందు ఆచారం అంటూ నర్తించే మాతమ్మల జీవితాల నుండి ఆ దురాచారాన్ని రూపు మాపి వెలుగును నింపాలని జిల్లా అధికారులు కృత నిశ్చయంతో వున్నారు. దీని కోసం 19 తేది డ్వాటిస్ స్వచ్ఛంద సంస్థ సహకారంలో వృత్యోగితా శిక్షణా శిబిరాన్ని అంబేద్కర్ భవన్‌లో ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు, ఎస్పీ రమణ మూర్తి, ఎమ్మెల్యే జె.కె. రెడ్డితో పాటు పలు సంక్షేమ శాఖల అధికార్లు పాల్గొన్నారు. మాతమ్మలు చిందులు మానితే రెండు నెలలలోగా ప్రభుత్వం వారికి ఆర్థిక సహాయం అందించి పునరావాసం ఏర్పాటు చేస్తుందని కలెక్టర్ చెప్పారు. వచ్చే ఏడాది నుండి ఈ ఆచారం ఎక్కడైనా కనపడితే అటువంటి వారి పై కఠిన చర్యలు తీసుకొంటా మన్నారు. మాతమ్మలను ప్రోత్సహిస్తే అటువంటి వారి పై జోగినీ నిరోధక చట్టం ప్రకారం శిక్షిస్తామని ఎస్పీ హెచ్చరించారు. ఈ దురాచార నిర్మూలనకు తన చేయూత కూడా నందిస్తానని ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి హామి ఇచ్చారు. డ్వాటిస్ సంస్థకు చెందిన నూనె వెంగయ్య మాతమ్మల పునరా వాసానికి మూడంచెల కార్యక్రమాన్ని ప్రకటించారు. వివిధ ప్రభుత్వ సంస్థల ద్వార అందిస్తున్న శిక్షణతో మాతమ్మల జీవితాల్లో మార్పు తెచ్చుకో గలదన్న ఆశా భావాన్ని వ్యక్తపరిచారు. ఈ శిబిరంలో జిల్లా నలు మూలల నుండి 30 మందికి పైగా మాతమ్మలు హాజరయ్యారు.

### అండర్ - 13 క్రికెట్ నెల్లూరు గెలుపు

నెల్లూరులోని అన్ని కళాశాలల ఆట స్థలాల్లో క్రికెట్ ఆడేందుకు సరియైన సౌకర్యాలు లేకపోయినా, ఆ ఆట పై పెంచుకొన్న మక్కువ, స్వయంకృషితో టౌన్‌లోని క్రీడాకారులు రాణిస్తున్నారు. గత నెలలో యూనివర్శిటీ స్థాయిలో జరిగిన క్రికెట్ పోటీల్లో వి.ఆర్ కళాశాల జట్టు ట్రోఫి గెల్చుకొని వస్తే, డిశంబర్ రెండవ వారంలో కడపలో జరిగిన 13 సంవత్సరాల లోపు బాలల క్రికెట్ పోటీల్లో జిల్లా జట్టు మరోసారి గెలుపొందింది. ఫైనల్స్‌లో కడప జిల్లా జట్టుతో హోరా హోరీగా పోరాడి సాధించారీ విజయం. సెమీ ఫైనల్స్‌లో గట్టి జట్టు కర్నూల్‌ను కూడ మట్టి కరిపించారట. జట్టు కెప్టెన్ సలీం బ్యాటింగ్‌లోనూ బౌలింగ్‌లోనూ తన తడాఖా చూపితే, ఆరో తరగతి చదువుతున్న జట్టులోని బౌలర్ మాధవ్ ఒక్క పరుగు కూడా ఇవ్వక ఆరు వికెట్లు పడగొట్టాడట. ఈ విజయ పరంపర తరువాత జిల్లా బాలలను రాష్ట్ర స్థాయి అధికారులు గుర్తించారు. రాష్ట్ర పోటీలకు గాను సౌత్ జోన్ జట్టులో నెల్లూరు వాళ్లనే ఏడుగురి ఎంపిక చేశారు. క్రికెట్‌లో మన జిల్లా క్రీడాకారులు చక్కగా రాణిస్తున్నారు. వీరి క్రీడా ఆసక్తిని అధికారులు సీనియర్ క్రీడాకారులు, రాజకీయ నాయకులైన క్రీడాకారులు, ప్రోత్సహించి తగిన సదుపాయాలు కల్పించి నెల్లూరు నుండి ఒక అజహరుద్దీన్, సచిన్ టెండూల్కర్‌ను జాతీయ జట్టుకు అందించి నెల్లూరు ఖ్యాతి నిలబెట్టాలి.

* * *

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

దర్శకుడు. కాని అవి ముఖం మొత్తినట్టుగా రూపొందాయి.

ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం టి.ఎల్.వి. ప్రసాద్ నిర్వహించారు. ఈ మూడు శాఖలూ నిర్వీర్యంగా వున్నాయి. ఆర్. హరిప్రసాద్ సంగీతం హద్దుమీరి శబ్దం చేసింది. డి.వి. రాజా ఫోటోగ్రఫీ, ఫైటింగులు బాగున్నాయి.

శివాజీ, శాంభవి, శశిరేఖ పాత్రలు సరిగ్గా ఎదగలేదు. ఉన్నంతలో భానుచందర్, జయసుధ, ఆమని బాగానే నటించారు. కాస్ట్యూమ్‌కృష్ణ పర్వాలేదు. పరవాధరావు మాటలు బాగా వ్రాశారు. నటన, ఫైటింగ్ మాటలు, ఫోటోగ్రఫీ కొంత ఊపు అందించినా ఆ ఊపు అందుకో లేక పోయింది చిత్రం. దానికి కారణం కథలోను, కథనంలోను కొత్తదనం లేక పోవటమే! బలహీనం ఎక్కువ కావటమే!

## సినిమా

(9 పేజీ కొరవ)

పోతాయన్న నమ్మకం దర్శక నిర్మాతలకు కలిగినట్లుంది. ఇక ఆ ముగ్గురి చుట్టూ తెగతిరిగేస్తున్నారు దానితో ఈ ముగ్గురూ చెట్లెక్కి కూర్చున్నారు. రేట్లు అమాంతంగా పెంచేశారు. ఇక, వాళ్ళు ఎప్పుడు కాల్‌షీట్లు ఇస్తే అప్పుడు షూటింగ్‌లు జరుపుకోవాలి. వీళ్ళ డామినేషన్‌తో దర్శక నిర్మాతలు చాలా ఇబ్బంది పడిపోతున్నారు. పైగా వీళ్ళ నోట్ల నుంచి ద్వంద్వార్థపు సంభాషణలు తప్ప మరే చక్కని సంభాషణలు వెలువడ్డా ప్రేక్షకులకు నచ్చదని మరో టాక్! ఐతే, ఇలాంటి సమస్యలెన్ని ఉన్నా ఎవరూ విరక్తి చెందకుండా సినిమాలు తీస్తూనే ఉన్నారు. తెలుగు సినిమా స్థితి నేడు ఇలా ఉంది. ఆఖరికి బాపు చిత్రంలో కూడా ఈ త్రిమూర్తులను బుక్ చేయవలసిన అవసరం ఏర్పడింది! తెలుగు ప్రేక్షకుని 'అభిరుచి' విచిత్రమైనది!

### మమ్ముట్టి సరసన విజయశాంతి

విజయశాంతికి చాలా కాలంగా ఒక మలయాళ చిత్రంలో నటించాలనీ అందులో హీరో మమ్ముట్టి అయి వుండాలని కోరిక వుండేదట. ఆ కోరిక "అహింస" అనే మలయాళ చిత్రంతో నెరవేర బోతుంది. అందులో ఫైట్స్ ఉన్నాయి. నేను కూడా రెండు ఫైట్స్ చేస్తున్నానండోయ్. ఈ చిత్రాన్ని తెలుగులో డబ్ చేయాలని కొందరు అనుకుంటున్నట్లు తెలిసింది. దాని కన్నా రీమేక్ చేస్తే మంచిది." అంది విజయశాంతి.

## విమానం

(12 పేజీ కొరవ)

ఎయిర్ బస్ ఎ - 300 బరువు రమారమి 90 టన్నులు, పెట్రోలు, సామాన్లు, నీళ్లు, తినుబండారాలు, ప్రయాణీకుల బరువు విషయంలో మరో 52 టన్నుల బరువు కల్గి వుంటుంది. ఇప్పుడా అదనపు బరువేది వుండదు కాబట్టి, 90 టన్నుల ఖాళీ విమానాన్ని మద్రాసుకు తరలించాలంటే, అంత బరువు మోయగల హెలికాప్టర్లు మన దేశంలో లేవు. ఒక వేళ విదేశాల నుంచి తెప్పించినా వాటిని నడిపే సాంకేతిక పరిజ్ఞానం, నిపుణత, అనుభవాలు మన పైలెట్లకు వుంటాయా అన్నది సందేహం. పొలాల్లోనే రిపేరు చేయాలంటే ముందుగా విమానం వున్న ప్రదేశం వరకు తారు రోడ్డు నిర్మించాలి. లేకుంటే పరికరాలు, యంత్రాలు అక్కడికి చేరవేయడం అసాధ్యమౌతుంది. విమానం ప్రక్కగా 330 అడుగుల వెడల్పు, పొడుగు గల చతురస్రపు కాంక్రీట్ ఫ్లాట్ ఫారం నిర్మించాలి. విమానాన్ని నిలపడానికి హేంగర్ కట్టాలి. అంత మేరా భూమిని రైతుల నుంచి కొనాలి.

ఇప్పటి వరకు పరిస్థితిని పరిశీలించిన దాన్ని బట్టి ఈ రెండు పద్ధతులలోనూ విమానాన్ని తిరిగి ఎగిరేటట్లు చేయడం ఆర్థికంగా ప్రయోజనకారిగా కన్పించడం లేదంటున్నారు. సాధారణంగా ఎయిర్ బస్ ఇండస్ట్రీస్ సంస్థ తమ విమానాలు రిపేరు చేయాలన్నా, కొత్తవి తయారు చేయాలన్నా వివిధ ప్రదేశాలలో వివిధ భాగాలు రిపేరు చేసి లేదా తయారు చేసి "గుప్పి" అనబడే ప్రత్యేక తరహా విమానంలో వాటన్నింటినీ ఒక చోటకు చేర్చి అసెంబ్లీ చేస్తుంటుంది. మొత్తం విమానాన్ని ఒక చోట తయారు చేసే వసతి వారికి లేదు. ఒక్కొక్క ప్రదేశంలో కొన్ని కొన్ని విడి భాగాలు తయారు చేస్తారు. ఇప్పుడీ విమానం రిపేరు విషయంలో ఆ పద్ధతులు పనికి రావడం లేదు.

ఇన్స్యూరెన్స్ కంపెనీ - లాయడ్స్ - ఈ విమానం విషయంలో ఇప్పటి వరకు ఏ నిర్ణయమూ తీసుకోలేకున్నది. విమాన రిపేరీ సంస్థ దేనికైనా కాంట్రాక్ట్ ఇచ్చి వారి నిర్ణయాను సారం రిపేరు చేయించాలా; లేక ప్రమాద స్థలంలో రిపేరు మద్రాసుకు తరలించడం లేదా మద్రాసుకు తరలించి రిపేరు చేయించడం అనే బాధ్యతలను ఇండియన్ ఎయిర్ లైన్స్ సంస్థకు అప్పచెప్పాలా, లేక అంతర్జాతీయ టెండరు పిల్చి వున్నది వున్నట్లుగా అమ్మి పారేయాలా అనే విషయం లాయడ్స్ సంస్థ నిర్ణయించుకో లేకున్నది. వీటిలో ఏది చేయాలన్నా కోట్ల ఖర్చు కన్పరుతున్నది. అంత ఖర్చు పెట్టి విమానాన్ని రిపేరు చేయించడం ఆర్థికంగా లాభసాటి కాదని నిపుణులు భావిస్తున్నారు. వీటిలో ఏది చేయాలన్నా కనీసం ఆరు నెలల పాటు విమానాన్ని అక్కడే వుంచాలి. అన్నిటికంటె ఉత్తమమైన మార్గం - పనికి రాని తుక్కు క్రింద విమానాన్ని ముక్కలు ముక్కలుగా విడగొట్టి, తూకం క్రింద ధర కట్టి, అమ్మి పారేయడం. ఆఖరుకు అదే జరుగుతుందని నిపుణుల అంచనా. తుక్కు క్రింద అమ్మినా పాతిక కోట్ల వరకు విలువ చేస్తుందని చెప్తున్నారు.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సర చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

# తృతీయ శక్తికి అంకురార్పణ!

రాష్ట్రంలో తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలకు దీటుగా మూడో రాజకీయశక్తి ఆవిర్భావానికి చురుకుగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉత్తర ప్రదేశ్‌లో వెనుక బడిన తరగతులు, హరిజన గిరిజన వర్గాల ఫ్రంట్ సాధించిన విజయం ఈ మూడోశక్తికి స్ఫూర్తిగా వుంది. మన రాష్ట్రంలో ఏర్పాటు కానున్న మూడోశక్తి గొడుగు క్రింద వెనుకబడిన తరగతులతోపాటు హరిజన గిరిజన వర్గాలు, మైనారిటీలను కూడా తీసుకువస్తారట. రాష్ట్రంలోని జనాభా లెక్కల ప్రకారం చూస్తే ఈ వర్గాల సంఖ్య గణనీయంగా వుంది. ఇంతవరకు కాంగ్రెస్ పార్టీనో లేక తెలుగుదేశాన్నో బలపరుస్తూ వస్తున్న ఈ వర్గాలు తమ ఉనికిని కాపాడుకునేందుకు, అగ్రకులాలను మాదిరిగానే రాజకీయాగ్రాలాన్ని హస్తగతం చేసుకోటానికి మూడోశక్తిని ఏర్పాటు చేసుకోవాలని భావిస్తున్నాయి. సమాజంలో నిర్లక్ష్యానికి గురవుతూ, అణగదొక్కబడుతున్న ఈ వర్గాల సంక్షేమం ప్రధాన లక్ష్యంగా ఏర్పాటు కానున్న మూడోశక్తి "ప్రాంతీయ పార్టీ" రూపంలో రాజకీయశక్తిగా కూడా రూపుదిద్దే ప్రయత్నాలు మొదలయ్యాయి. ఈ నూతన పార్టీకి జాతీయస్థాయి బిసి, హరిజన గిరిజన నాయకులు, ములాయంసింగ్ యాదవ్, కాన్షీరామ్ వంటి నాయకుల సహాయ సహకారాలను తీసుకోవాలని భావిస్తున్నారు.

ఈ నెల 18 వ తేదిన రాజధానిలో జరిగిన రాష్ట్రవెనుక బడిన తరగతుల సంఘ సమావేశంలో 'మూడోశక్తి' ఏర్పాటును గురించి చర్చించారు. సర్దార్ గౌతులచ్చన్న, కె.వి. కేశవులు, కేశవరావు, కె.వి. కృష్ణమూర్తి, బాలాగౌడ్ తదితరులు పాల్గొన్న ఈ సమావేశంలో మూడోశక్తి ఏర్పాటు గురించి 'తుది' నిర్ణయం అంటూ ఏదీ తీసుకోకపోయినప్పటికీ ఇటు కాంగ్రెస్, అటు తెలుగుదేశం పార్టీల్లో వున్న బిసి, హరిజన గిరిజన, మైనారిటీ నాయకులను ఒకే తాటి మీదకు తేవాలని స్థూలంగా నిర్ణయించారు. మాజీ ఎంపి బాలాగౌడ్, గౌతులచ్చన్న, కె.వి. కేశవులు వంటి వృద్ధ నాయకులు మూడోశక్తి విషయమై సమాలోచనలు ప్రారంభించారు.

## రాయలసీమ

(మొదటి పేజీ కొరవ)

రెడ్డి పై చర్య తీసుకొనే ముందు ఆయన లేవ నెత్తిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి! వాటికి సమాధానం చెప్పడమంటే రవాణా మంత్రి మైసూరా రెడ్డి నుంచి రాజీనామా తీసుకుని, హైకోర్టు న్యాయమూర్తి చేత మైదుకూరు దుర్ఘటనపై దర్యాప్తుకు ఆదేశించాలి. ఇవి రెండూ చేస్తే వైఎస్ వ్యూహం ఫలిస్తుంది; చేయ కుంటే కల్తీ సారా మృతులకు బాధ్యులైన వారిని మంత్రి వర్గంలో వుంచుకున్నారన్న నింద పడుతుంది. ముఖ్యమంత్రి చాలా కోపం మీద వున్నారు. ఆ కోపంలో ఏ తొందర పాటు నిర్ణయమైనా తీసుకోనేట్లున్నారాయన. వైఎస్‌కు కావలసింది అదే.

వీరిద్దరూ ముఖాముఖి యుద్ధానికి తలపడితే రాయల సీమలో ఎటువంటి విష పరిణామాలు తలెత్తుతాయోనని పరిశీలకులు భయపడుతున్నారు. రక్తపాతానికి పేరు పడిన కడప, కర్నూలు, అనంత పురం జిల్లాలు యుద్ధ శిబిరాలుగా తయారైతే జరిగేది మారణ హోమమే. ఏడాదిలో ఎన్నికలు పెట్టుకొని నాయకులిట్లా తమ వ్యక్తిగత కక్షలు, కార్పణ్యాలు తీర్చుకోవడానికి కత్తులు నూరడం దురదృష్టకరమైన విషయం. ప్రధాని పివి జోక్యం చేసుకొని ఇద్దరి మధ్య సంధి జరిపి, శాంతి వచనాలు పల్కితే తప్ప ఈ పరిస్థితి మారే సూచనలు కన్పించడం లేదు.

## 145 కోట్ల రూపాయల ప్రశ్న!

## కుప్పకూలిన విమానం పాత తుక్కేనా?

వెంకటగిరి పొలాల్లో కుప్ప కూలిపోయిన ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానాన్ని ఏమి చేయనున్నారు? నూట నలభై ఐదు కోట్ల ప్రశ్న ఇది!

నవంబర్ 15 తేది ఉదయం హైదరాబాదు నుంచి మద్రాసుకు తిరిగి వెళ్తూ, పెట్రోలు చాలక మెత్తటి బురద పొలాన్నే రన్‌వేగా భావించి, క్రిందకు దింపేసి, ప్రయాణీకుల ప్రాణాలు కాపాడాడు పైలట్. అప్పటి నుంచి ఆ విమానం అక్కడే వుంది. విమానం ముఖ భాగం 3 అడుగుల లోతు బురదలో కూరుక పోయి వుంది. తోక భాగం మాత్రం గాలిలో తేలుతున్నది. దీన్ని ఏమి చేయాలి? ఎట్లా వెలికి తీయాలి? తీస్తే మళ్లీ పనికి వస్తుందా? పాత ఇనుప తుక్కు క్రింద అమ్మివేయ వలసిందేనా?

ఫ్రాన్స్‌లోని ఎయిర్ బస్ ఇండస్ట్రీస్ తయారు చేసిన ఈ విమానాన్ని ఇప్పుడు కొనాలంటే 200 కోట్లు పైన ఖర్చవుతుంది. అయితే 10 సంవత్సరాల పాతది కాబట్టి, డిప్రిషియేషన్ పోను 140 కోట్ల విలువగా నిర్ణయించి (45 మిలియన్ డాలర్లు) లండన్‌లోని లాయడ్స్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ దగ్గర భీమా చేయించింది ఇండియన్ ఎయిర్ లైన్స్ యాజమాన్యం. మన దేశంలోని ఇన్స్యూరెన్స్ కంపెనీలకు ఇంతంత పెద్ద మొత్తాలకు భీమా చేయించుకునే ఆర్థిక స్తోమత, సాంకేతిక పరిజ్ఞానం లేవు. ప్రమాదం జరిగిన తీరును బట్టి, లాయడ్స్ సంస్థ ఇండియన్ ఎయిర్ లైన్స్‌కు 140 కోట్ల మొత్తం చెల్లించడం ఖాయం. అందువల్ల కూలిన విమానం లాయడ్స్ ఆస్తి క్రింద పరిగణనౌతుంది.

దీన్ని తిరిగి వుపయోగంలో పెట్టడానికి రెండే రెండు మార్గాలున్నాయని నిపుణులు అంచనా వేస్తున్నారు. మొదటిది ఆ పొలాల్లోనే కూర్చుని విమానాన్ని రిపేరు చేయడం; రెండవది మూడు ముక్కలుగా విడగొట్టి, హెలికాప్టర్ల సాయంతో పైకి లేపి, తిరుపతి, లేదా మద్రాసు విమానాశ్రయానికి చేర్చి రిపేరు చేయడం. కొరవ 11 పేజీలో

## ఎన్టీఆర్

(మొదటి పేజీ కొరవ)

అనుకున్నదే తడవుగా ఇప్పుడుంటున్న ఇంటికి దగ్గరలోనే కొత్త ఇంటి నిర్మాణాన్ని ప్రారంభించారు. ప్రస్తుతం వుంటున్న ఇల్లు చిన్న కూతురు పేరుతో వుంది. తన తదనంతరం ఆ ఇల్లు చిన్న కూతురికే పోతుంది. మరి తన ముద్దుల పెళ్లాం లక్ష్మీ పార్వతి మాటేమిటి? అందుకే తనపేరుతో కొత్త ఇంటిని మొదలు పెట్టారు. పాత ఇంటిని ఎలాగూ అమ్మాలన్న నిర్ణయానికి వచ్చారు కాబట్టి పార్టీ నిధుల కోసం ఇల్లు అమ్ముకున్నారన్న సానుభూతి పొందేందుకు పత్రికల్లో ప్రకటన ఇచ్చారు. ఇప్పటికే తెలుగుదేశం పార్టీ టిక్కెట్లపై మోజు పెంచుకున్న తమ్ముళ్లు, అన్నగారి 'త్యాగనిరతిని' వేనోళ్ల కొనియాడుతూ 'ఇల్లు అమ్మవద్దంటూ' తమకు 'తోచిన' రీతిలో సమర్పించు కుంటున్నారు. పార్టీ టిక్కెట్ల కోసం తలా 5 లక్షలు వసూలు చేస్తున్నారట. ఆ డబ్బు ఏమి చేస్తున్నట్లు? ఏమైతేనేం ఒక దెబ్బకు రెండు పిట్టల్ని కొట్టే విద్య ఒక్క రామారావుకే ఎరుక.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,